# ఆటవెలదుల తోట

## పులికంటి కృష్ణారెడ్డి

విశ్వంభర పబ్లికేషన్స్ ప్రచు. 4
తిరుపతి

# "AATAVELADULA THOTA"

by

**Pulikanti Krishna Reddy**



First edition July 2002

Copies : 1000

Art and cover design :
Chandra.

Price : **Rs. 75/-**

Published by :
Viswambhara Publications
467, Bandla Street, Tirupti
Phone: 58884

Type Setting :
University Xerox, Tirupati

Printing :
Nagarjuna Printers, Chennai-600 021

For copies :
Smt. P. Sudeshnadevi, 467, Bandla Street, Tirupati.
Visalandhra Publishing House, Abids, Hyderabad-500 001
Navoyadaya Book House, Kacheguda. Hyderabad - 500 027



**ఆచార్య పి.వి. అరుణాచలం**
విశ్రాంత ఉపాధ్యక్షులు
ద్రవిడియన్ విశ్వవిద్యాలయం

# ఫోన్ పలికితే ! .......

ఆధునిక మానవ జీవితంలో నిత్యావసర పరికరాల్లో 'ఫోన్'కు ఒక విశిష్ట స్థానం ఉంది. అది కాలాన్ని దూరాన్ని సన్నిహితం చేయగల శక్తివంతమైన సాధనం. ప్రయోగశీలి అయిన మానవమేధ వికసించే కొలదీ ఇలా మనిషికి ఏదో ఒక సౌకర్యం సౌలభ్యం అవుతూనే ఉంది. ఫోన్ కాని దాని కపుడులో పుట్టిన సెల్‌ఫోన్ కానీ అలా సంక్రమించిన సౌకర్యాలే!

నాగరికుడైన నేటి మానవుడు ఈ సౌకర్యాన్ని సొంతం చేసుకోవడంలో ఏమాత్రం వెనుకాడడం లేదు. అలాంటి వాళ్లల్లో నేనూ ఒకడినే కదా? ఇంట్లో ఫోన్ పలుకుతుంది. ఎవరో ఆప్తులో... ఆత్మీయులో... బంధువులో.... స్నేహితులో పలకరిస్తారని తెలుస్తుంది కానీ పలకరించే వరకు ఎవరో తెలియదు. ఆ మధ్య ప్రతి ఉదయం ఎనిమిది గంటల ప్రాంతంలో ఫోన్ పలికిందంటే అది కవిత్వం వినిపిస్తుందని తెలిసి నవ్వుకొంటూ అందుకొనే వాడిని!

ప్రముఖ కథారచయిత కవి నటుడు గేయకర్త శ్రీ పులికంటి కృష్ణారెడ్డి సంప్రదాయ కవిత్వం జోలికి పోయినట్టు చాలామందికి తెలియదు. ఇప్పుడు దాని అంతు కూడాపట్టి చూడాలన్నట్లుగా ఆపని పట్టినట్లుంది. ఉదయం గంట నడకలో ఒక శీర్షికను ఎన్నుకొని దానిపై ఆరుపద్యాలు అల్లి అవి కాగితం మీదికి ఎక్కక మునుపే నా చెవిలో వేసేవాడు. ఈ కావ్యంలోని 86 శీర్షికల్లో అల్లిన 516 పద్యాలన్నీ అక్షరాలకు సిరాపూత పూయకమునుపే నేను ఆస్వాదించినవే!

శీర్షికలను ప్రాస నియమంతో ఎన్నుకొన్నాడు. మన్ను, మిన్ను, కన్ను, పన్ను, వరుసగా వినిపిస్తూ 'చన్ను' కూడా రాస్తానంటే ఆ మనిషి తత్త్వం తెలిసి నేను 'వద్దబ్బా' అన్నాను. వద్దు అంటే కద్దు అనే తత్త్వం కదా? ఆ మరుసటి రోజు వినిపిస్తే విస్తు పోవడం కాదు నిజంగా నమస్కరించాలని పించింది. మచ్చుకు ఒక్క పద్యం.

విడిచి ఒక్క చన్ను వేరొక చన్నును
పట్టులోపల పనిపట్టి సకల
విద్యలందు నేర్పు విధిగ సాధించరా
కంటి నలుసుర పులికంటి మాట!

అలతి అలతి పదాలతో ఇంత అర్థవంతంగా పద్యం అల్లడం అనితర సాధ్యమైన ప్రతిభ. తెలుగు సాహిత్యంలో ప్రత్యేకించి పద్య రచనలో ఒక విలక్షణమైన వినూత్న ప్రయోగం ఈ కావ్యం!

— పి.వి. అరుణాచలం

# చిరుకానుక



శ్రీలు చెలువొందు కనువిందు సింహపురము
వడ్లగింజకు రెడ్లకు వన్నెతెచ్చె
రాగధారల మురిపించుసాగరమ్ము
తట్టి వెదజల్లు నెరజాణ తనమునమ్ము!

దాన ఆదాయ పన్నుల దౌత్యవిధుల
నిగ్గు తేలిన మొగలాయి నీతిపరుడు
పెళుసుమాటల కలిమిలో పేదవాడు
చెలిమి సరసులో విరిసిన కలువరేడు
కృతిని గైకొని శ్రుతిచేసె కీర్తివీణ!

కారమందున అధికారమే గొప్పను
మాట మూతికింత మసినిపూసి
మాన్యచరితుడనగ మనిషిని మనిషిగా
గౌరవించు నట్టి ఘనుడతండు!

కలరు ఎంతమంది కలరధికారులు
కళల ఊసులెత్త కంటగింపు!
కళల గాలిసోక కరగివాదిగిపోవు
ఎముక లేనిచేయి ఎవరుసాటి?

అతనికతడెసాటి ఔదార్యసంపత్తి
దాసిగ తనయింట తనరుచుండ
అతనికతడెమేటి ఔదల దాల్చగ
జాతి ప్రగతి కోరు నీతిమతుల!

తేమలేనట్టి సీమలో తెగువమీర
కలము హలమాయె సాహితీ పొలమునందు
ఆటవెలదుల తోటను అందగించి
పరులమేలును కోరెడు ప్రాజ్ఞుడనగ
వినయ సంపద కలిగిన విజ్ఞుడనగ
శ్రీధరా! చేకొనుమిదె! ఒక చిన్నికాన్క!

# కృతజ్ఞత కుసుమాంజలి

డా॥ మన్నవ భాస్కర నాయుడుగారు ఉసిగొల్పకపోతే - ఎప్పుడో రెండు దశాబ్దాలకు మునుపు భారతిలో అచ్చయిన కొన్ని శీర్షికలు ఆటవెలదుల తోటలో పూచేవి కావు - ప్రథమ తాంబూలంగా ఆయనకు....

విశ్రాంత ఉపాధ్యక్షులైనా అవిశ్రాంతగా భూప్రదక్షిణాలు చేస్తున్న ఆత్మీయ మిత్రులు ఆచార్య పి.వి. అరుణాచలం 'ఫోన్‌పలికితే' పలికించి నందుకు...

ఉదయారుణ కాంతుల్లో తడుస్తూ కలిసినడుస్తూ... లేదా ఎదురు పడుతూ వినిపించిన పద్యాలకు చిరునవ్వు బహుమతులిచ్చిన ఆచార్య కె. మునిరత్నం గారికి...

ఆటవెలదుల తోటలో ఆత్మీయంగా అడుగుపెట్టి వేమన సరసన నిలబెట్టిన సద్విమర్శకులు దశాబ్దాలుగా మాన్యమిత్రులు సాహిత్యబ్రహ్మ డా॥ వి.వి.యల్. నరసింహారావు గారికి....

ఆత్మీయంగా అంతఅక్షరసాదు సాది ఉదగరగా చేర్చుక్క పెట్టిన ఆచార్య బేతవోలు రామబ్రహ్మం గారికి...

ప్రతిశీర్షికను ఓపిగ్గా విని అవసరమైన మార్పులు సూచించిన ఆత్మీయ బావమరిది శ్రీ వై.యం. రెడ్డిగారికి.

సాహితీ కృషిని ఒక కంట గమనిస్తూ ప్రోత్సహిస్తున్న
శ్రీ వోలేటి పార్వతీశం...
తమ్ముడు యార్లగడ్డ బాలగంగాధర రావు
ఆ తమ్ముడికి తమ్ముడు కథాశిల్పి శ్రీ వల్లభనేని అశ్వనీ కుమార్
ఆచార్య సర్వోత్తమరావు, కవి మిత్రుడు శ్రీ వేంపల్లి అబ్దుల్ ఖాదర్
జి.జయన్న, ఎ. రామచంద్రయ్య ఆదిగా గల మిత్రులకు

చివరగా....

నా సాహితీ ప్రచురణ
తమ వంతు కర్తవ్యంగా భావించి సహకరిస్తున్న
ఆత్మీయ మిత్రులు శ్రీ ఎ. గోవిందరెడ్డి సుపుత్రులు
అపూర్వ సహోదరులు



శ్రీ ఎ.వి. పశుపతిరెడ్డి



శ్రీ ఎ. శ్రీధర్

# వేమన్న వెలుగుబాటలో పులికంటి!

'సాహిత్య బ్రహ్మ' డా॥ వి.వి.యల్. నరసింహారావు
రిటైర్డ్ డైరెక్టర్, రాష్ట్ర కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖ, హైదరాబాదు

'ఆటవెలదులతోట' శ్రీ పులికంటి కృష్ణారెడ్డిగారి అభినవ పద్యకృతి. ఇందులోని ఖండికలు కొన్ని లోగడ 'భారతి'లో ప్రచురించ బడినవే. వాటికి మఱికొన్ని చేర్చి, అయిదు శతకాలకు సరిపడ బృహత్ శతకంగా దీన్ని రెడ్డిగారు రూపొందించారు.

శతక మనగానే మకుటం మీదికి మనసుపోతుంది. ఇందులో మకుటం "కంటి నలుసుర పులికంటి మాట". ఈ మకుటం చూడగానే ఒక్కసారి నాకు ఒళ్లు జలదరించింది. వెంటనే వేమన్న గారి హెచ్చరిక జ్ఞాపకం వచ్చింది.

**'చెప్పలోని రాయి, చెవిలోని జోరీగ**
**కంటిలోని నలుసు, కాలి ముల్లు'**

వీటివల్ల కలిగే ఇబ్బంది ఇంతా అంతాకాదు. 'పులికంటి పద్యాల వల్లకూడా ఇటువంటి ఇబ్బంది తప్పదేమో' అని అనిపించింది. ఏదైనా ఒక రచన సంతోషం

కోసమో సదుపదేశం కోసమో చదువుతాము.కంట్లో నలుసులాగా ఇంట్లో పోరులాగా ఇబ్బంది పడటంకోసం చదవం కదా!

మఱి పులికంటికి పాఠకలోకం మీద ఎంతకింత కసిరేగింది?

ఈ ఒక్క ప్రశ్నకు జవాబు చెప్పుకో గలిగితే ఈ కావ్య పరమార్థం మనకు అర్థమైనట్లే.

నిజానికి జీవితం సుఖదుఃఖ సమ్మిశ్రితం. కష్టసుఖాల కలగలుపు. గట్టిగా మాట్లాడితే సుఖాలకంటె కష్టాలూ, దుఃఖాలే ఎక్కువ. "ఇదుగో, ఈ కష్టాలను ఎదుర్కోబోతున్నారు, ఈ దుఃఖాలను అనుభవించ బోతున్నారు" అంటూ వాటిని గుర్తు చేయటం వల్ల తాత్కాలికంగా కంటిలో నలుసువలె బాధపెట్టినా, పదిలంగా నలుసును తీసివేసు కోవటం వల్లా, కష్టాన్ని అధిగమించటం వల్లా దృష్టి ప్రసన్నమై క్రమంగా ఆనందం కలుగుతుంది. ఇటువంటి ఆనందాన్ని ప్రసాదించటమే పులికంటివారి ఈ పద్యకృతి పరమార్థం.

గట్టిగా చెప్పవలసి వస్తే పులికంటివారు పద్యకవిగా ప్రసిద్ధులు కారు. నటుడుగా, నాటికా రచయితగా, సంగీత రూపకర్తగా, గేయకవిగా, కథా రచయితగా బుర్రకథాకర్తగా, వ్యాసరచయితగా, మాండలిక భాషా ప్రవీణుడుగా ఆకాశమంత ఎత్తు ఎదిగిన సాహితీ మూర్తిగా పులికంటి ప్రసిద్ధుడు. దుర్యోధనుడుగా, తిమ్మరుసుగా, పఠాన్ రుస్తుంగా ఇంకా ఇంకా సాంఘిక నాటక పాత్రధారిగా ఎన్నో పురస్కారాలు పొందిన నటుడు పులికంటి. "మేకలూ! మీకు కొమ్ములున్నాయ్" వంటి నాటికలను చూచినవారు మర్చిపోగలరా?. "సూర్యుడు ఉదయించడు" వంటి సంగీత రూపకాల సంగతి చెప్పేదేముంది? "మోసులు ఎండిపోతున్నాయి" వంటి కథలు గుండెలు జలదరింపచేస్తాయే! ఇకమాండలిక భాషా రచనల్లో మకుటంలేని మహారాజు పులికంటి.

పురుషుడుగా స్త్రీని భక్తితో సంభావించే తత్త్వం పులికంటిది. ఇంట్లో అమ్మను గూర్చి, ఇల్లాలిని గూర్చి ఈయన భావించే తీరు నేటి మహిళా మహోద్యమాలకు ముందుచూపు కలిగించేటట్లు ఉంటుంది. ఇటువంటి విశాల భావం కల కవి ఆటవెలదుల తోటలో ఎందుకు ప్రవేశించినట్లు? ఏ మధురవాణి అయినా ఎదురుపడక పోతుందా? అనే ఆశతోనా? కాదు, ఖచ్చితంగా కాదు. సంఘ సంస్కరణ దృష్టికల ఆధునిక కవికి ఆటవెలది జ్ఞాపకం వచ్చిం దంటే - అలనాటి వేమయ్య - ఛందోరూపంలో చిత్తంలో చిందు తొక్కుతున్నాడని అర్థం. పులికంటి పరిస్థితీ అంతే ఐంది. అందుకే తన పద్యకృతిని 'వేమనజాడ'తో ప్రారంభించాడు. వట్టిజాడ కాదు, వేమన అడుగుజాడతో ప్రారంభించాడు.

> **"సంఘ సంస్కరణకు సాహితీ విప్లవ,**
> **మ్ముద్యమాలు లేపి ఊరువాడ**
> **విశ్వకీర్తి గొన్న విప్లవ వీరుడా!**
> **వేమ! నీదుమాట వెలుగుబాట."**

వేమయ్య చూపిన వెలుగుబాటలో పయనిస్తూ పులికంటి - ప్రజల కంటినలుసులు పదిలంగా తొలగిస్తూ, మంచి చూపు ప్రసాదించటమే కావ్య లక్ష్యం.

వేమన్నగారి ఆటవెలది అడుగు సవ్వడులు వినిపించగానే పులికంటి వారి కావ్య శీర్షికలు కూడా తాళలయలతో కదలటం మొదలుపెట్టాయి. వినండి. చూడండి. పదవి - పెదవి, అదుపు - పొదుపు, కలిమి - చెలిమి, మోహము - దాహము, మతము - గతము, సమత - మమత, కలము - హలము, వలపు - తలపు, మలుపు - పిలుపు, గెలుపు - పలుపు అంటూ మరొక అడుగు

ముందుకు వేసి 'బడి-గుడి-ముడి' అంటూ 'అల-వల-కల- తల-వెల, అవ్వా - తవ్వా - ఉవ్వా - నివ్వా - ముల్వా - మెప్పు, భక్తి-ముక్తి- రక్తి-భుక్తి-యుక్తి-శక్తి, ఓర్పు-నేర్పు-తీర్పు-కూర్పు, మన్ను- మిన్ను-పన్ను-చన్ను' అంటూ 'బెట్టు-గుట్టు-చెట్టు-పట్టు' కొనసాగిస్తూ, అనుప్రాసంలో కదంతొక్కుతూ, తెలుగు హైబ్రీడ్‌ను ప్రస్తావించి 'భాష బ్రీడుచేయ దోషమెట్లగునురా?' అంటూ భాషను అనవసరంగా సంకర చేయువారిపై ఒక మెత్తని చురక అంటించాడు శ్రీ పులికంటి. వేమనార్యు జాడ వెదకి పట్ట గలిగిన తృప్తి కలిగిందీయనకు. 'కథలు, గేయాలు కమ్మగా అల్లుకొనే పులికంటి పద్యకవితలో ప్రావీణ్యం చూపగలిగాడా? అని ఎవరైనా ప్రశ్నిస్తే ఈయన జవాబు ఇది.

**దెప్పిపొడిచినారు దేశాన కొందరు**
**కవిని కాదు నేను కథకుడనని**
**కల్లనిజము లరయ కవితలే సాక్షిరా**
**కంటి నలుసుర పులికంటి మాట**

ఔను, ఈ కావ్యంలోని 86 శీర్షికల క్రింద అల్లుకొన్న 516 ఆటవెలదుల అద్భుత నృత్యభావాలే అందుకు ప్రత్యక్ష నిదర్శనం. షట్పదీనాదాలతో, షడ్జస్వరాలతో సహృదయ సంస్కారం కలిగిస్తాయి ఇవి. ఒక్కమాటలో చెప్పాలంటే - ఈ కావ్యం పులికంటిని - వేమన సరసన నిలబెడుతుంది.

వి. వి. యల్. నరసింహారావు

# చేర్చుక్క

ఆటవెలదుల ముక్తకానికి పీఠిక ఎంతక్లుప్తంగా ఉంటే అంతమంచిది. చేటంత ముఖమైనా చిన్న చుక్క చాలదూ!

ఆటవెలదుల్ని రాయాలంటే పాటగాడికే చెల్లు. తాళమూ, లయ వాడికి తెలుసు గనక ఆటవెలది నడక అందగిస్తుంది. ఇది గేయలక్షణాన్ని కడుపున పండించు కున్న దేశిపద్యం. దేశి పద్యాలన్నీ అంతే. అంచేత వీటిని నడిపించడానికి ఒడుపు తెలియాలి. వీటిలో గణాలు అక్షర సంఘాలు కావు. గతి నిర్దేశకాలు. వీటిలో పాదాలు యతి గణ పరతంత్రాలు కావు. తాళ లయ నియంత్రితాలు. వీటిని రాసి అవుననిపించుకోవడం చాలాకష్టం.

పులికంటి కృష్ణారెడ్డి మౌలికంగా కథా రచయిత. ఆపై గేయరచయిత. అందునా జానపద గేయ రచయిత. అంచేత వారికి ఆటవెలది బాగా మచ్చిక అయ్యింది.

వేమన్నగారు ఈ ఆటవెలదికి ఒక వస్తువును అందించి వెళ్ళాడు. అది దీనికి సహజ కవచకుండలాల్లా అమిరి పోయింది. అధిక్షేపాన్ని ఆటవెలదినీ వేరు చెయ్యడం చాలాకష్టం. కృష్ణారెడ్డి గారు ఈ తోటనిండా అధిక్షేపాలు గుత్తికాపుగా పండించారు. దానికి అనువుగా కంటి నలుసుర పులికంటి మాట అన్న మకుటాన్ని సమకూర్చుకున్నారు. పాటకు పల్లవిలాగా శతకానికి మకుటమేప్రాణం. అది పై చరణాలలోని భావచారిమకు సర్వాత్మనా అతకాలి. మెచ్చుకోలు పద్యాన్ని చురకవేసే మకుటంతో ముగించలేం కదా! అంచేత ఇలాంటి మకుటాన్ని కూర్చుకున్న కవి అధిక్షేపం కాని విషయాన్ని స్పృశించే స్వాతంత్ర్యం కోల్పోతాడు. తనకి తాను కళ్ళెం బిగించుకున్నట్టే. కానీ వందల పద్యాలు రాయగా రాయగా కొన్నాళ్ళకో కొన్నేళ్ళకో

మకుటం తన అస్తిత్వాన్ని కోల్పోయి కవిని మోసగిస్తుంది. అప్పుడు మకుటంతో అతకని భావాలు - అంటే ప్రస్తుతసందర్భంలో అధిక్షేపేతర వస్తువు - మొదటి మూడు పాదాలలోనూ వచ్చి కూచుంటుంది. దీన్ని పాఠకుడు గుర్తిస్తాడు. పల్లవికీ చరణానికీ సయోధ్య కుదరని వైనం కన్పిస్తుంది. అందుకే గడసరి కవులు మకుటంలో వస్తు నిర్దేశానికి చోటివ్వరు. సంబోధనలతో సరిపెట్టేస్తారు. అంత్యాను ప్రాసలతో కనుబామూతారు. అప్పుడు పూర్వ పాదాల నిర్వహణలో వారు సర్వతంత్ర స్వతంత్రులు. ఎక్కడో మొదలు పెట్టి ఎక్కడికో సాగుతున్నాను. అప్రస్తుత ప్రశంసలాగా ఉన్నట్టుంది!

వీరి మకుటంలో మరొక చమత్కారం ఏమిటంటే - పదాల ముంగింపు గణాల ముగింపూ సంవదించక పోవడం. గతి తప్పినట్టు లేదా కుదరనట్టు కంటికి అనిపిస్తుంది. కానీ దాన్ని సరిపెట్టే అదనపు శక్తి ఈ కవికి ఉండటం వల్ల గొంతెత్తి చదివేటప్పుడు గతి కుదురుతుంది. బహుశ యతి స్థానంలో మొత్తం పదమంతా పునరావృత్త మవ్వడంతో తాళానికి దృఢత్వం పెరిగి గతిని సర్దుబాటు చేసిందేమో! ఏమైనా ఇది పులికంటి కృష్ణారెడ్డిగారి అదనపు శక్తికి నిదర్శనమే!

సభలలో మారుమోగిన పద్యాలివి. కవితా ప్రియుల నాల్కలపై నేటికీ ఆడసాగిన పద్యాలివి. వీటిలో ఒకటో రెండో ఉదాహరించి వస్తు విశ్లేషణ చెయ్యబోవడం సాహసమే అవుతుంది. పోనీ భాషా విశ్లేషణ చేద్దామంటే అది జానపద ధోరణికే విరుద్ధమవుతుంది. అంచేత ఆ బరువులు ఎత్తుకోను గానీ అడుగడుగునా నన్నలరించిన ఈ ఆటవెలదికి ఇదిగో ఈ చిన్ని చేర్చుక్క ఉడగరగా సమర్పించి సంతృప్తి చెందుతూ మీకు స్వాగతం పలుకుతూ సెలవు తీసు కుంటున్నాను.

మీ

**ఆచార్య బేతవోలు రామబ్రహ్మం**

# నా పద్యానికి నేపథ్యం

నిజానికి మద్యం రుచి మరగకముందే పద్యం రుచి ఎరిగిన వాడిని!

ఒకానొక సభలో నా మాట... నా పాట విని. "నేను నీకు గురువును రా!" అంటూ దగ్గరచేరి మనిషికంటే మదువే నమ్మదగినదని సోదాహరణగా వివరించి నమ్మించి నా జీవితంలో నాలుగు దశాబ్దాలకుపైగా లేని అలవాటును అలవాటుగా మార్చిన ఘనత శ్రీమాన్ శంకరంబాడి సుందరాచారిదే!

**అర్థము గడియించి అధికారమునపొంగి**
**అతివలిచ్చు సుఖములనుభవించి**
**ఆశతీర త్రాగి ఆడినా పాడినా**
**చిక్కలేదు సుఖము శ్రీనివాస !**

-అంటూ చిక్కని సుఖాన్ని వెదుక్కొంటూ వెళ్లిపోయాడు మహానుభావుడు!

1950 సంవత్సరంలో ఎస్సెస్ ఎల్సీ పరీక్షలో ఒక పద్యపాదం ఇచ్చి గణ విభజనచేసి ఏ పద్యపాదమో గుర్తించమంటే 'ఉత్పలమాల' అని గుర్తించలేక "అయ్యో! ఐదు మార్కులు పోయెనే!" అని గుడ్లనీళ్లు కుక్కుకున్న వాడికి పద్య ధార అబ్బడం అబ్బురంలో అబ్బురమే!

సభలకో సన్మాలకో పెండ్లి పేరంటాలకో 'పంచరత్నాలు' అక్షరరూపంలో ఆశీస్సులకు ఊపిరి పోస్తే అచ్చులో పేరుచూసుకొని మురిసిపోయిన దినాలు గుర్తున్నాయి!

ఆ దశలోనే పద్యానికి ప్రాణమిచ్చే మహాకవి చెళ్లపిళ్ల సుబ్రహ్మణ్య శర్మగారు కవిసమ్రాట్టులు విశ్వనాథ సత్యనారాయణ గారికి కవిగా పరిచయం చేయడం... ఆయన 'కవివా?' అంటూ ఒక్క చూపు విసిరి నాలుగు పద్యాలు చదవమనడం ఒక అపూర్వ సంఘటన! -

**వచ్చని తోరణాలు కనువందువు గూర్చెడు వింత వేడుకల్**
**విచ్చిన పూవు గుత్తులును వీనుల విందగు మేళతాళముల్**
**వచ్చిన బంధువర్గముల వారిజ నేత్రల హాసలాసముల్**
**తెచ్చెను పెండ్లి వందిరికి తీయదనమ్మును మోద భావమున్!**

ఇలా రెండు పద్యాలు చదవగానే "గంగనోట్లో పోయకుండా దినానికి నాలుగు పద్యాలు రాయరా. నన్నుమించిన వాడవుతావు!" అని ఆ ప్రతిభా పక్షపాతి పలికితే. "స్వామీ! నాకీభూమ్మీద నూకలు చెల్లిపోవా లనుకున్నారా? ఈ రెండు పద్యాలు

రాయడానికి నాలుగు దినాలు పట్టింది! "అని అంటే నవ్వుల పువ్వులు సీతాకోక చిలుకలై తిరుపతి కొత్తసత్రంలో ఎగిరింది ఇప్పటికీ నా మనోయవనిక మీద చెరగని దృశ్యమే! -

కాలం కండ్లకు గంతలు కట్టిందా? లేదు. అర్థశతాబ్దం చూస్తూ చూస్తూ ఉండగానే ఎలా కరిగిందో కరిగిపోయింది!

ఈ అర్థశతాబ్దిలో జీవితంలో ఎన్నిమలుపులు?

నటుడుగా స్థిరపడాలన్న నిర్ణయం రైల్వే ఉద్యోగానికి నీళ్లొదిలిస్తే... రాయల సీమలో రంగస్థలపునరుద్ధరణ రాతిమీద సేద్యంగా అనుభవానికొస్తే - మొగంలో రంగును అక్షరాలకు అద్దే ప్రయత్నంలో కథాసాహిత్యంలో కాలూనితే - ముందు పుట్టిన చెవుల కంటే కొమ్ములు వాడి అన్నట్లుగా - పద్యం రుచిని మద్యం చప్పరించేసింది.

అయినా తెలుగు సాహిత్యంలో పద్యం పద్యమే! - ఎందరు ఎన్నివిధాల నిరసించినా అది నీరసించని ప్రక్రియ!

అందుకేనేమో అప్పుడప్పుడు నాతో ఆటవెలదిగా ఆడుకొనింది. పదవి, పెదవి, కలిమి, చెలిమి - ఖండికలుగా పదో పన్నెండో రెండు దశాబ్దాల క్రితం భారతిలో అచ్చయ్యాయి. అవి ఆ మధ్య డా॥ మన్నవ భాస్కర నాయుడుగారి కంటపడ్డాయి. "పద్యాలు చాలాబాగున్నాయ్! - ఇంకొక ఆరేడు శీర్షికలైతే శతకం అవుతుంది కదా? ప్రయత్నించండి" అని పురికొల్పితే పురులు విప్పుకొన్న గుండె పట్టుపట్టింది.

సప్తతి తరువాత ఈ జీవితానికి ఉదయాన నడక తప్పనిసరి అయితే - ఆ గంట నడకలో ప్రతిదినం ఒక శీర్షికను ఎన్నుకొని ఆరు పద్యాలు అల్లడం - విధిగా 72 శీర్షికలు పూర్తిచేశాను. డెబ్బైరెండేండ్లు - డెబ్బైరెండు శీర్షికలు - అని సంతృప్తి పడితే ఆచార్య కె.జె. కృష్ణమూర్తిగారు. "పద్యాలు బాగున్నాయి. 516 పద్యాలు చెయ్యండి' అన్నారు - అందులోని విశిష్టత నాకైతే తెలియదు.

**నడక తప్పదనగ నాదగు జన్మకు**
**నడక పట్టే నడత నాదు కవిత**
***కవిత నడత లెప్ప కైమోడ్పు వేడెద!***

అవును! - ఆచార్యుల ఆప్తవాక్యాన్ని కాదనడం ఎందుకనుకుంటే 86 శీర్షికలతో 516 పద్యాలతో ఆటవెలదులతోట మీ చేతుల్లో ఉంది. ఇవి కంటి నలుసులో... పంటికింద రాళ్లో... లేదు - ప్రొఫెసర్ మూలె విజయలక్ష్మి గారు "అనుభవంతో అనుభూతితో పండించిన ఆటవెలదుల తోట లోకానికి వెలుగుబాట!" అనడం నిజమో! నిర్ణయించాల్సింది పాఠక దేవుళ్లే!

**- పులికంటి కృష్ణారెడ్డి**

నిత్యజీవితంలో మనకు అడుగడుగునా ఎదురయ్యే

ఎన్నెన్నో నగ్నసత్యాలను నగ్నంకాని రీతిలో

ఒక నవ్యమైన  నీతిలో కవి రూపొందిస్తాడు.

కవిత్వంలో అభివ్యక్తమైన విషయాలు

గుప్త విషయాలు కాదు, వ్యక్త విషయాలే.

అవి పదిమందికీ తెలిసిన విషయాలే.

కాని కవితలను చదివినపుడు కాని అవి తమకు

తెలిసిన విషయాలని చాలమంది గ్రహించరు.,

తెలియని విషయాలను తెలిపి రక్తి కట్టించడం

అంత సులభం కాదు.

**-సంజీవ్ దేవ్**

# వేమనజాడ

తెలుగు పలుకు బడులు తేటైన భావాలు
పలుకు పలుకునందు పల్లవింప
కవిత లల్లినట్టి కవిరాజ! రసరాజ!
వేమ! నీదు మాట వెలుగు బాట !

పలికిన ప్రతి పలుకు పద్యమై ఒప్పారె
నాల్కనాల్క కొనల నాట్యమాడె!
పుర్రె పుర్రెచేరి పురుగొచు తొలిచెరా
వేమ! నీదు మాట వెలుగు బాట !





కుల మతమ్ములనెడు కుష్ఠురోగాలపై
తిరుగులేని మందు తెలియచెప్పి
సర్వమానవాళి సహపంక్తి కోరిన!
వేమ! నీదు మాట వెలుగు బాట!

సంఘసంస్కరణకు సాహితీ విప్లవ
ముద్యమాలులేపి ఊరువాడ
విశ్వ కీర్తిగొన్న విప్లవవీరుడా!
వేమ! నీదు మాట వెలుగు బాట !

గాలిపోలు కవిత గాలించి చూడని
చోటు లేదటన్న సూక్తి పుట్టె
నిఖిల జగతి కవికి నీరాజనము లిచ్చె
వేమ! నీదు మాట వెలుగు బాట !

సాహసమ్ము చేయ సర్వజ్ఞుడను కాను
మార్పు చెందినట్టి మనుజు నడత
ఎత్తి చూప చేతి కెత్తితి కలమును
వేమ! నీదు మాట వెలుగు బాట !

# పదవి

చెరకు రసము కన్న చెలియ మాటల కన్న
తేనెచినుకు పాల తేట కన్న
పెదవి తీపికన్న పదవి తీపిర మిన్న
కంటి నలుసుర పులికంటి మాట !

కూడు గూడు లేక కుములుచు మనవచ్చు
కొన్ని దినములైన కోర్కె లుడిగి
పదవి లేని క్షణము ప్రాణాలె నిలువవు
కంటి నలుసుర పులికంటి మాట !





కూటికొరకు పడెడు కొరగాని పాట్లెల్ల
పదవి కొరకు పడిన ఫలితమబ్బు
తెలిసి బ్రదుకలేని తిక్కోళ్లు సన్నోళ్లు
కంటి నలుసుర పులికంటి మాట!

ఇంద్రుడంత వాడు ఇంగితమ్మును వీడి
పడతి నొడ్డలేదె పదవి కొరకు
నీవు నేనుచేయ నేరమెట్లగునురా?
కంటి నలుసుర పులికంటి మాట!

ఎగ్గు సిగ్గు విడిచి ఎన్నెన్ని మార్గాల
అడ్డదారుల పడి గడ్డికరచి
పదవి నందు వాడె ప్రాజ్ఞుడై ధరచెల్లు
కంటి నలుసుర పులికంటి మాట!

మందుమాకులైన మంత్రతంత్రములైన
వీగి పోయి నట్టి రోగిచెవిని
పదవి పేరు పడిన పైకి దిగ్గున లేచు
కంటి నలుసుర పులికంటి మాట!

# పెదవి

అందమైన పెదవి అమరిన దన్నచో
లోన ఇమిడియున్న లొసుగులెన్ని?
మురికిగుంట మీద ముసుగులా పెదవులు!
కంటి నలుసుర పులికంటి మాట!

కదిలి కదలకుండ కమ్మని పలుకులు
పలుక గలదు వలపు చిలుకగలదు
చిలుక పలుకు వెనుక చీత్కార మరయరా!
కంటి నలుసుర పులికంటి మాట!





గుండెదాక వచ్చిగొంతులో కొట్లాడి
నాల్కకొనల చేరి నలుగుమాట
పెదవిదాటకున్న పెన్నెట్లు దాటును?
కంటి నలుసుర పులికంటిమాట!

వంపు సొంపులందు ఇంపును జతచేర్చి
మారుతారు చేయు మంచిచెడుల
మార్చగలదు పెదవి మాట మంత్రమ్ముగా
కంటి నలుసుర పులికంటిమాట!

పెదవితీపి మరిగి పెడదారు లందున
తిరిగి తిరిగి కడకు తిక్కకుదిరి
పెదవి కాల్చుకొన్న పెద్దలెందరు భువి ?
కంటి నలుసుర పులికంటిమాట!

పదవి నిలుపగలదు పలుకుబడిని కూడ
పెంచగలదు కొంప ముంచగలదు
పెదవి ఎవనికైన పెట్టని కోటరా!
కంటి నలుసుర పులికంటిమాట!

# చదువు

కలిపి అక్షరాలు గడగడ చదివిన
చదువు నేర్చె ననుట చాలతప్పు
చదువు మర్మ మరయ చాలదు బతుకురా!
కంటి నలుసుర పులికంటి మాట!

చదువు వచ్చు ననగ చాకలి పద్దును
జమలు ఖర్చు రాయ చదువు కాదు
లోక రీతులందు లోతులె చదువురా!
కంటి నలుసుర పులికంటి మాట!





మనిషి మనసు లోతు మమతల హద్దులు
కన్నపేగు లోతు కళల లోతు
చదువ కలిగి నపుడె సార్థకమౌ జన్మ
కంటి నలుసుర పులికంటి మాట !

ఇంగితమ్ము వీడి ఎన్ని పాత్రము లైన
చదువ ఫలితమేమి? సారమెరిగి
ఒరుల కింతమేలు ఒనరించ మేలురా!
కంటి నలుసుర పులికంటి మాట!

అక్షరాలు కలుప అందమౌ పదములు
పదము పదము కలుప వాక్యమౌను
వాక్కు శుద్ధిలేని వాక్కెట్లు చదువురా?
కంటి నలుసుర పులికంటి మాట!

ఎంత చదువు చదివి ఎన్నెన్ని రాసినా
మట్టిపాలె కడకు మనిషి బతుకు
మట్టినుండి ముక్తి మర్మమ్మె చదువురా
కంటి నలుసుర పులికంటి మాట!

# అదుపు

అదుపు ఆజ్ఞ లనగ అవి సరిహద్దులు
హద్దు దేనికైన అవసరమ్ము
అదుపు ఆజ్ఞలందు ఆంతర్య మరయరా
కంటి నలుసుర పులికంటి మాట!

అదుపు ఆజ్ఞలందు ఒదిగిన బతుకులో
దుడుకు తనము తోక ముడుచుకొనును
అదుపు ఆజ్ఞ లనగ అవి ముకుతాళ్లురా
కంటి నలుసుర పులికంటి మాట!





పదవి అదుపు తప్ప ప్రాణాంతకమ్మగు
పెదవి అదుపు తప్ప పేరు చెడుపు
నాడి అదుపు తప్ప నాంది రోగానికి
కంటి నలుసుర పులికంటి మాట!

కలము అదుపు తప్ప గాడిద ఓండ్రింత
హలము తప్ప తిండి అసలె లేదు!
కుంచె అదుపు తప్ప కుదురునా చిత్రము?
కంటి నలుసుర పులికంటి మాట!

వేగమదుపు తప్ప వేయారు బాధలు
రోగమదుపు తప్ప రోతబతుకు
అదుపు దేనికైన ఆఖరి మెట్టురా
కంటి నలుసుర పులికంటి మాట!

పంచ భూతములవి పద్ధతి తప్పిన
ఊహకందని గతి ఉర్వి పైన
సూత్రధారి అదుపు సూక్ష్మమ్ము తెలియరా!
కంటి నలుసుర పులికంటి మాట!

# పొదుపు

ప్రగతి ప్రగతి అనుచు పలుమారు గొంతెత్తి
అరచి నందు వలన అలుపె మిగులు!
పడయ వచ్చు ప్రగతి పాటించి పొదుపును
కంటి నలుసుర పులికంటి మాట!

మాటలందు పొదుపు మర్యాద సమకూర్చు
చేతలందు పొదుపు 'రాత'మార్చు
రూకపొదుపు బతుకు రూపురేఖల మార్చు
కంటి నలుసుర పులికంటి మాట!





ఎగిరి పడును ఎలుక ఎంగిలి కూటికి
కలుగునందు ఇరుపు కనులు తిరుగు
ఎలుక ముందు చూపు ఎందరి కుందిరా?
కంటి నలుసుర పులికంటి మాట!

చుక్క చుక్క అనుచు చులకన చేయకు
చుక్క చుక్క చేర్చి చూడు పిదప
సాగరమ్ము నిలుచు సాక్షిగా కనుముందు
కంటి నలుసుర పులికంటి మాట!

నారు పోయువాడె నీరు పోయునను చు
అధిక సంతతిగన అలమటింపె
పందిసంతు పొంద ఫలిత మేముండెరా?
కంటి నలుసుర పులికంటి మాట!

ఖర్చు నోరు తెరచి గడనను కబళించ
తప్ప దెవనికైన అప్పు బతుకు
అసలుకన్న వడ్డి అధికమై నట్లురా
కంటి నలుసుర పులికంటి మాట!

# కలిమి

గడ్డిగాదము తిని గడియించుగద లోభి
కోరినంత ధనము కోట్లకొలది
కలుగు లాభమేమి? కడలినిండుగ నీళ్లు!
కంటి నలుసుర పులికంటి మాట!

తానుతినక కొంతదానమ్ము సేయక
చూచిచూచి తనియు నీచమతులు
గడ్డివాముల కడ కావలి కుక్కలు
కంటి నలుసుర పులికంటి మాట!





రూకలున్న నేత లోకమునే గెల్చు
లోకమతని కొలుచు తోకముడిచి
రూకముందు తెలివి పోకకు పోలదు
కంటి నలుసుర పులికంటి మాట!

కలిమి కలిగినపుడు కాకులు లోకులు
మూకచేరి చంక నాకువారె!
చంక తట్టుతారు చాలని వేళల
కంటి నలుసుర పులికంటి మాట!

తగిన పనులకైన తగినంత సాయమ్ము
చేయలేని నరుని చెంత ధనము
కుక్క నోటిలోని గుండ్రాయి చందమ్ము
కంటి నలుసుర పులికంటి మాట!

వచ్చునపుడు వెంట తెచ్చుకొన్నది ఏమి?
పోవువేళల కొనిపోవు టేమి?
మట్టి నడిగిచూడు మనసువిప్పియె చెప్పు
కంటి నలుసుర పులికంటి మాట!

# చెలిమి

తలపులోనె తృప్తి తర్కించ సంతృప్తి
ఎదుట పడిన చాలు ఎంత తృప్తి?
చెలిమి కలిమి కొలుచు కొలమాన మున్నదా?
కంటి నలుసుర పులికంటి మాట!

మతము జాతులనెడు మాటల మసిచేసి
హెచ్చుతగ్గులనగ చిచ్చుపెట్టు
అందమైన బంధమది కంటపడదురా!
కంటి నలుసుర పులికంటి మాట!





అవసరమ్ము కలుగ అందల మెక్కించి
అవసరమ్ము తీర అవలనెట్టి
పనులు గడుపు కొనెడు ప్రతిభకే జోహార్లు!
కంటి నలుసుర పులికంటి మాట!

కలిమి లేము లందు కన్నీళ్ళు దెప్పించు
కలతలందు చెడిన వలపు లందు
మలుపు తిప్పుకున్న మలినమౌ చెలిమిరా!
కంటి నలుసుర పులికంటి మాట!

దారి తప్పినపుడు ధైర్యమ్ము కోల్పోయి
వగచు నపుడు బాధ వదలనపుడు
వదలి తిరుగువాడు వాడెట్టి చెలికాడు?
కంటి నలుసుర పులికంటి మాట!

మనసు మనసు కలిసి మమతలు పెంపొంది
పెరిగి పెరిగి కడకు విరిగినపుడు
చెలిమితీపి విలువ చెడినప్పు డెరుకరా!
కంటి నలుసుర పులికంటిమాట!

# లంచము

జీత మందుకొనుట జీవనమ్ము కొరకు
లంచ మనుట సుఖము పెంచుకొరకు
సుఖము పెంచగలుగు సూక్ష్మమే లంచము
కంటి నలుసుర పులికంటి మాట!

ఎంత లంచమైన అంతసులువు గాదె
పనులు జరుపుకొనుట పదిలముగను
మేపుకొలది గోవు చేపును పాలను
కంటి నలుసుర పులికంటి మాట!





ఉత్తకాగితమును ఉంచిన ఫలమేమి?
ఎగురకుండ గాలికెటుల నిలుచు?
అందుకొరకు గాదె అవసరమ్ము బరువు
కంటి నలుసుర పులికంటి మాట!

కన్నకొడుకు కూడ కదలడు పనిచెప్ప
ముట్టకుంటె దుడ్లు మూతిముడుచు
ఎవడొ వాడు కొంత ఇమ్మన్న పాపమా?
కంటి నలుసుర పులికంటి మాట!

విశ్వరూపమెత్తి వేయారు రీతుల
లంచమనెడు శక్తి మించియుండ
ముడుపు గట్టుటేల? మూఢులై రాళ్లకు
కంటి నలుసుర పులికంటి మాట!

ఎన్ని పేర్ల పరగు ఇలపైన దైవమ్ము
అన్ని రూపములను అదియు వెలుగు
కొలిచి చూడు దాని కోటీశు డౌదువు!
కంటి నలుసుర పులికంటి మాట!

# దోపిడి

దోపిడనుచు మనిషి దొర్లాడి పొర్లాడి
గొంతు చించుకొనుట కొత్తతంతు
దార్లుగొట్టి మునుపు ధరణి పాలింపరే?
కంటి నలుసుర పులికంటి మాట!

దొరల మాటలందు దోపిడి తత్త్వము
గంతులిడుచు నున్న వింతచూడ
'దొంగ దొంగ' యనుచు దొంగలరచినట్లు
కంటి నలుసుర పులికంటి మాట!





నోరుగట్టి ఒకడు నోళ్లుగొట్టి ఒకడు
కూడబెట్టు కొనును కోట్లధనము
తేనెటీగ శ్రమను తేరకే దోచరా
కంటి నలుసుర పులికంటి మాట!

దోపిడీల విద్య దొరల పరముచేసి
లేనివాని పరుగు లేడిపరుగు
కోటి విద్యలెల్ల కూటికొరకు గాదె?
కంటి నలుసుర పులికంటి మాట!

భాషఒకటె గాదు భావమ్ము సైతము
తస్కరించి వెలుగు ముష్కరుండు
దోపిడీల తీరు దుయ్యబట్టుటె జోరు
కంటి నలుసుర పులికంటి మాట!

కరములు ముకుళించి కరుణింపుమని వేడ
నిలువు దోపి డనుచు నిన్నుదోచు
వేల్పు లెటులగారు మేటి దోపిడిగాళ్లు?
కంటి నలుసుర పులికంటి మాట!

# గద్దె

నల్లరాతి నొకటి నాజూకుగా చెక్కి
గద్దెనిచ్చి చూడు గట్టితనము
ఉలికి పలుకకున్న ఊరేగు లోకాన
కంటి నలుసుర పులికంటి మాట!

చదువు సందెవద్దు శాస్త్రపాండితి వద్దు
మంచిచెడ్డ లరయు మనసు వద్దు
గద్దె ఒకటి చాలు ఘనుడనిపించగా
కంటి నలుసుర పులికంటి మాట!





అడ్డుదార్ల గద్దె నందుకొనుచు నుండ
గడ్డుదారు లేల గణన కెక్క?
రేటుపెట్టి డాక్టరేటులా చందాన
కంటి నలుసుర పులికంటి మాట!

మురికి నీరు గూడ ముత్యమై ఒప్పారు
తామరాకు మీద తావు దొరక
బుద్ధి హీనుడైన బుధుడౌను గద్దెపై
కంటి నలుసుర పులికంటి మాట!

ఎట్టివానినైన ఎక్కించుగద్దెపై
భజనపరుల నోట భోజుడౌను
కృష్ణరాయడౌను కృతు లందుకొనుటకు
కంటి నలుసుర పులికంటి మాట!

లంచగొండులైన లాలూచి గాళ్ళైన
దోపిడీల బ్రదుకు దొంగలైన
ధర్మకర్త లైరి దర్పాన గద్దెపై
కంటి నలుసుర పులికంటి మాట!

# మనసు

మనసు లేదటంచు మాటిమాటికి దెప్పి
పొడుచు వాని మాట విడిచిపెట్టు
విషములేని కొండి వెదకిన దొరకునా?
కంటి నలుసుర పులికంటి మాట!

కలదు కలదు మనసు కలిగిన వానికి
లేని వాని కైన గూని కైన
గూనిలేని మనసు కుదురుటే భాగ్యము
కంటి నలుసుర పులికంటి మాట!





కాళ్లు చేతులున్న కట్టెలో దాగిన
మనసు కంటపడదు మాట వినదు
విడిచిపెట్టి చూడు విఱ్ఱవీగెడి తీరు
కంటి నలుసుర పులికంటి మాట!

మనసుపడిన చిలుక మన్నన పొందగ
వేలు తగులబెట్టు వెఱ్ఱిజనము
చాపలేరు చేయి సత్కార్య సమయాల
కంటి నలుసుర పులికంటి మాట!

ఒకటి రెండుగాదు ఓయబ్బ కోర్కెల
పుట్టమనసు దాని పొట్టగొట్టు
కోర్కెచెవిని పడగ కుప్పగ కూలును
కంటి నలుసుర పులికంటి మాట!

ధైర్యసాహసాలు దయయును ధర్మమ్ము
వీసమైనలేని మూస మనసు
భావ శుద్ధిలేని పద్యమ్ము పోలిక
కంటి నలుసుర పులికంటి మాట!

# అంతరంగము

మాట గారడీల మనుజుల నాకట్టి
వంచనమ్ము చేయ, పంచదార
చేదుమాత్రకంత చేర్చిన రీతిరా!
కంటి నలుసుర పులికంటి మాట!

రంగు గుడ్డకట్టి రాణించ వలెనన్న
పొట్టినక్క బుద్ధి పోల్చలేమె?
అంతరంగమేదో అందరి కెరుకరా
కంటి నలుసుర పులికంటి మాట!





ఎవడు గద్దెనెక్కె అవినీతి మార్గాల
వాడె నీతియనుచు వాగు తీరు
గొంగడందు కూడు కుడుచుట రీతిరా!
కంటి నలుసుర పులికంటి మాట!

పొందినపుడు పొగడి పొందకున్న తెగడి
వన్నెకెక్కు వాని వన్నె లెన్ని?
నరములేని నాల్క నాట్యమ్మె నాట్యమ్ము
కంటి నలుసుర పులికంటి మాట!

జనము నాడి తెలిసి జన్మలెత్తెడి వాడు
నాకు నీకుకూడ నాయకుండె!
నాడి తెలియకున్న వాడెట్టి వైద్యుడు
కంటి నలుసుర పులికంటి మాట !

తలలు శూన్యమైన తరము వర్ధిలుదాక
మనుజున కొకసేన మహిమ మహిని
గొర్రెవెనుక గొర్రె గొంతెత్తు రీతిరా
కంటి నలుసుర పులికంటి మాట!

# తృప్తి

పలుక నోరురాదు ప్రాణాలె వీడిన
తృప్తి చెందితినని! తిక్కమనిషి
ఆశ తేనెయందు అలమటించెడు ఈగ!
కంటి నలుసుర పులికంటి మాట!

ఎంత వచ్చిపడిన ఇకకొంత మరికొంత
వలయు ననెడు వాంఛ వదలబోదు
కొవ్వు పెరుగు కొలది గుండెకే చేటురా!
కంటి నలుసుర పులికంటి మాట!





ఆకుముందు మనుజు డారాట పడుతీరు
చూడ చూడ చాలచోద్య మగును!
కడుపు చిన్నదైన కన్నులు పెద్దవి
కంటి నలుసుర పులికంటి మాట!

బ్రదుకు విలువ తెలుపు భాగ్య మారోగ్యము
అందులోని తృప్తి పొందినపుడె!
సున్నమందు దాగె సూక్ష్మమై తృప్తిరా
కంటి నలుసుర పులికంటి మాట!

పడకు పడకు తృప్తి పరులకు పెట్టగా
పడకు తృప్తి మంచిపనులు చేయ
తృప్తిలోని హాయి తెలియగ త్యాగమే
కంటి నలుసుర పులికంటి మాట!

తృప్తి లేనిజన్మ తీరును మార్చగా
మందు మాకులేల! మంత్రమేల?
తిరుగులేని మాట! తీర్చును మట్టిరా!
కంటి నలుసుర పులికంటి మాట!

# వేషము

రంగుగుడ్డ విడిచి రామన్న కట్టెను
మల్లెపూవు వంటి తెల్లబట్ట
పగటి వేషగాళ్లె ఫక్కున నవ్విరి
కంటి నలుసుర పులికంటి మాట!

పగటివేష గాళ్ల ప్రారబ్ధమేమియో
గడప గడప పూట గడుపు కొరకు
అసలు వేషగాడు అన్నకెందుకు పాట్లు?
కంటి నలుసుర పులికంటి మాట!





తెల్లబడిన జుట్టు తీరది తెలియదా?
రంగుపులిమి దాని రాతమార్చ
గుడ్డమార్చ అసలు గుణమెట్లు మారును?
కంటి నలుసుర పులికంటి మాట!

రంగుపులిమి మొగము రంగులు మార్చిన
రాజుపేద, పేద రాజు కాడు
వెర్రివారె ప్రజలు వేషాలు ఎరుగరా ?
కంటి నలుసుర పులికంటి మాట!

ఉస్సురనిన చాలు ఊసరవెల్లులు
రంగు మార్చుకొనును రమ్యగతుల
మారదసలు రూపు మార్చగా రంగులు
కంటి నలుసుర పులికంటి మాట!

మగువ మధువు రుచులు మరిగినట్టి మనిషి
ఇంద్రుడైన వాడు చంద్రుడైన
మహిని చూడలేము మాటపై నిలుచుట
కంటి నలుసుర పులికంటి మాట!

# మోసము

మోసపోయితి మని మొత్తుకొనెడి వారి
జాడ చూడ చాల జాలిగొలుపు
మహిమ మీరినట్టి మంత్రమే మోసము
కంటి నలుసుర పులికంటి మాట!

సామ దాన భేద సకల గుణంబులు
వీగిపోయి నపుడు విడిచి చూడు
నిక్కి నీల్గు వాడె నిలువున కూలురా
కంటి నలుసుర పులికంటి మాట!





మోసగానికాలు మోకాటి గుంతలో
పడునటన్న మాట పాతమాట!
నీతిభీతి దాటి నిలబడు తీవిగా
కంటి నలుసుర పులికంటి మాట!

నమ్మపలికి పలికి నయమార మురిపించి
చేయి చేయి గలపి చెంతచేర్చి
పట్టు విడువకుండ నట్టేట ముంచును
కంటి నలుసుర పులికంటి మాట!

పిడికెడంత కసవు ప్రియమార చూపించ
వెంట పడెడు గొర్రె వెర్రిగాదె?
గొర్రెకన్న మనిషి గుణవంతు డెట్లగు?
కంటి నలుసుర పులికంటి మాట!

రంగవైభవముగ రాణించ వలెనన్న
మోసగించు టొకటె మొదటి దారి!
మొదటి దారి నమ్మ మొదటికే మోసమౌ
కంటి నలుసుర పులికంటి మాట!

# మోహము

కాలుజారి పడిన ఖచ్చితముగ పైకి
లేచి నడచుటొక్క లెక్కగాదు!
మోహమందు పడిన మొదటికే మోసమౌ
కంటి నలుసుర పులికంటి మాట!

తల్లిదండ్రి మాట తనమేలు కోరెడి
హితుల మాట సన్నిహితుల మాట!
చెవిని పెట్టనీక చెడగొట్టు మోహమే!
కంటి నలుసుర పులికంటి మాట!





తనకు మించినట్టి ఘనుడిల లేడని
విఱ్ఱవీగు వాని వీథి కీడ్చి
వెఱ్ఱివాని చేసి విలపింప చేయురా!
కంటి నలుసుర పులికంటి మాట!

రిమ్మ తెగులు దాని అమ్మకడుపు మండ
పడదు కంటిమీద పడదు రెప్ప
అసలు మతికిరావు ఆకలిదప్పులు
కంటి నలుసుర పులికంటి మాట!

ఇంద్రుడైన వాడు చంద్రుడే అయినను
మునిగి తేలలేదె మోహమందు
భస్మమాయె గాదె భస్మాసురుండైన
కంటి నలుసుర పులికంటి మాట!

మూర్ఖుడనగ రాదు మోహింప - మోహించి
మూర్ఖుడైన వాదు మోయరాదు;
మూలమాయె గాదె మోహమే సృష్టికి!
కంటి నలుసుర పులికంటి మాట!

# దాహము

గుక్క మీద గుక్క గుటగుట తాగిన
తాప మడచి నీరు తపన మాన్పు
దాహమనగ నీటి తాపమే కాదురా
కంటి నలుసుర పులికంటి మాట!

దాహ తత్త్వ మరయ తగినట్లు యోచన
చేయ గలిగి నంత చేసినపుడు
దాహ నిలయమె గద దేహమేదైనను
కంటి నలుసుర పులికంటి మాట!



పడిన శ్రమనుబట్టి ప్రశ్నించు దాహమ్మ్
తీర్చ గలదు గుక్క తీర్థమైన
తీర్చ గలదె నీరు దేహాన దాహాల?
కంటి నలుసుర పులికంటి మాట!



దేహమందున ధనదాహమే తీరదు
తీర్చుకొలది పెరిగి తీరుమార్చు
కట్టెలందు పెట్టి కాల్చిన తీరునా?
కంటి నలుసుర పులికంటి మాట!

పెట్టు గుణము లేక పట్టుగా కృషిలేక
వారు కొనగ కీర్తి వల్ల కాదు
కీర్తి దాహమునకు కృషియె కిరీటము
కంటి నలుసుర పులికంటి మాట!

కామ దాహమునకు కామాలు పెట్టకు
మోక్ష దాహములకు ముందు పడకు
ధర్మమెరిగి పరుల దాహార్తి తీర్చరా
కంటి నలుసుర పులికంటి మాట!

# దాసోహము

దైవ సన్నిధి పడి దాసోహ మనినంత
'మనిషి' తన్ను తానె మరువ గలడు
తన్నుతాను మరవ దైవసన్నిధి యేల?
కంటి నలుసుర పులికంటి మాట!

దైవ భీతి కలుగ తప్పది కాదురా
సోహ మనుట లోని సూక్ష్మ మరయ
ఎరుగ నిన్ను నీవు ఎరుకగు దైవమే
కంటి నలుసుర పులికంటి మాట!





కామ క్రోధ లోభ ఘన మోహ మదమత్స
రాదిగుణములందు అర్థమరయ
దారి వెదకి పట్టి దాసోహ మనిపించు
కంటి నలుసుర పులికంటి మాట!

చదువు చదివినంత సర్వజ్ఞుడనుకొని
విర్ర వీగు టెంత వెర్రితనము?
వెర్రితలల వంచు విధమది తెలియరా
కంటి నలుసుర పులికంటి మాట!

మగువ మధువులందు మత్తుకు దీటుగా
కోపతాపములకు చాపపరచు
గుణము వాత మట్టికొట్టగ తెలివిరా
కంటి నలుసుర పులికంటి మాట!

ద్వైతమనగ తెలియు దక్షత లేదు, అ
ద్వైతమనగ తెలివి తలపు లేదు
తత్త్వ మెరుగలేక దాసోహ మంటిని
కంటి నలుసుర పులికంటి మాట!

# గతము

మనిషి మనిషి గతము మనిషికే వర్తించ
జాతి గతము నెంచ సామూహికమ్మగు
అరయ దేశ గతము చరితగా నిలుచురా
కంటి నలుసుర పులికంటి మాట!

అనుభవమ్ము గతము అదితేరకే రాదు
రాత అనుభవాల మోత కాదు
చేత అనుభవమ్ము చేపట్టి చూడరా
కంటి నలుసుర పులికంటి మాట!





గురువులేని విద్య గురుతర మైనట్టి
అనుభవమ్ము నమ్ము అందుకొనుము
గతమె పాఠమైన గమ్యమే సులువురా
కంటి నలుసుర పులికంటి మాట!

గతము మేలు వచ్చుకాలము కంటెను
ఆదికవికి నేర్పె అనుభవమ్ము
ఎదురు లేని మాట ఇలపైన ఎపుడైన
కంటి నలుసుర పులికంటి మాట!

గతము వెతల కతలు కార్చిన కన్నీళ్లు
పేర్చిన అనుభూతి వెన్నుదన్ను
గతము తలచి వగచ కలదెంత సుఖమురా
కంటి నలుసుర పులికంటి మాట!

ఊహ తెరల మీద ఊరించు గతమును
బొమ్మ కట్టి చూడ బోధ పడును
భవితకు బహురమ్య భవనాల కడగాలె!
కంటి నలుసుర పులికంటి మాట!

# మతము

మతము పుట్టలేదు మనిషి పుట్టుకతోనె
మనిషి పుట్టె పిదప మతము పుట్టె!
వెనుక పుట్టి జనుల విభజించి పాలించు
కంటి నలుసుర పులికంటి మాట!

మతము పుట్టుకరయ మనిషిలో స్వార్థమే
వేరుచేసె జనుల వెర్రిచూడ
మనుజు లొకటె గాదె మతములు వేరైన
కంటి నలుసుర పులికంటి మాట!





మందు కలదు జగతి మనిషి రోగాలకు
మతమె రోగమైన మందు లేదు!
రూప రహితమైన రోగమే మతమురా
కంటి నలుసుర పులికంటి మాట!

తాగ మత్తుమందు తన్మయత్వము నందు
ఊగులాట మత్తు ఉండు వరకె!
దిగదు మతము మత్తు దింపుడుకళ్లాన
కంటి నలుసుర పులికంటి మాట!

నాదిగొప్ప, కాదు నాదియే గొప్పని
మతము వెంట పడగ మౌఢ్యమౌను!
మతము గళము విప్ప మర్మమ్ము లొకటెరా
కంటి నలుసుర పులికంటి మాట!

మనిషి మంచి కోరి మతములు పుట్టగా
పుట్టె మతము పుండు పుర్రెలందు
మతము పేర వలదు మారణ కాండరా
కంటి నలుసుర పులికంటి మాట!

# వ్రతము

తిండి తిప్ప లనక తీర్థాలు సేవించి
వంగి శిలల మ్రొక్క వ్రతముకాదు
పట్టుదలకు వ్రతము పెట్టింది పేరురా
కంటి నలుసుర పులికంటి మాట!

వ్రతము పేరుపెట్టి వండిన వంటలు
మెక్క ఒక్కపూట మేలు గాదు
పరులమేలు కోరి పాటించ వ్రతమురా
కంటి నలుసుర పులికంటి మాట!





పట్టిపట్టనట్లు పనులు చేపట్టిన
అంది అందనట్లు అందుఫలము
ఉడుము పట్టుపట్టు ఉన్నది ఫలితము
కంటి నలుసుర పులికంటి మాట!

వ్రతము ఎప్పుడైన వక్రమార్గమ్ములో
నడువ మనదు తప్పు, నుడువ మనదు
వ్రతము పేరుమీద వలదురా వంచన
కంటి నలుసుర పులికంటి మాట!

బాపు పట్టె వ్రతము భారతదేశాన
తెల్లదొరల పొత్తు తెంపు కొనగ
అట్టిదైన వ్రతమె అమరత్వ మందురా
కంటి నలుసుర పులికంటి మాట!

మంచికొరకు కాని మరిచెడ్డకొరకైన
వ్రతము తప్పదాయె వసుధలోన
వ్రతము ప్రగతి కొరకె వ్రతమనిపించురా
కంటి నలుసుర పులికంటి మాట!

# మితము

అమిత మైన ఆశ అదిమూలమౌ గద
మితము తప్పి మనిషి మిడిసి పడగ
ఆశ నదుపు చేయ అనుభవమ్మె మితము
కంటి నలుసుర పులికంటి మాట!

కష్టసుఖము లెన్ని కలత పెట్టిన కాని
మితము మీరుటెపుడు హితము కాదు
మితము మీర బతుకు వెతలపాలే గదా?
కంటి నలుసుర పులికంటి మాట!



మాటలందు మితము మన్నన పొందగ
చేతలందు మితము చింతమాన్ప
ఆకుముందు మితము ఆరోగ్యకరమురా
కంటి నలుసుర పులికంటి మాట!



నిద్రలందు మితము భద్రత భవితకు
ఆటపాటలందు హాయి గొలుపు
అప్పు మితము తప్ప తప్పవు తిప్పలు
కంటి నలుసుర పులికంటి మాట!

మితము హితము మీరి గతమందు ఎందరో
పడిరిగాదె పొట్లు పతనమైరి
మితము అమితమైన మిన్నాగు కాటురా
కంటి నలుసుర పులికంటి మాట!

అదుపు పొదుపులందు అణగెరా మితమది
అడుగుజాడ పట్టి మడుగులొత్త
సాగు బతుకు తీరు సవ్యమై భవ్యమై
కంటి నలుసుర పులికంటి మాట!

# సమత

సమత వచ్చెననుచు సాగిలపడి యేడ్చు
జనుల జాడ చాల జాలి గొలుపు
ఆరణాలకూలి ఆంధ్రను పాలించె!
కంటి నలుసుర పులికంటి మాట!

కష్టనిష్ఠురముల సుష్ఠుగా చవిచూచి
గద్దె నెక్కునట్టి ఘనుల చలువ
కూలి వారికికను కూడెందు కనిపించు
కంటి నలుసుర పులికంటి మాట!





కష్టపడెడు వాడె కడకు సుఖములందు
కానకష్టపడుము కలత వలదు
జడియుటేల నయ్య జన్మజన్మములుండ
కంటి నలుసుర పులికంటి మాట!

వచ్చుజన్మ సుఖము వలదను కొన్నారు
నీకు నాకుగానె నిలిపినారు
త్యాగధనుల ఋణము తప్పదు తీర్చక
కంటి నలుసుర పులికంటి మాట!

దైవ దత్తమైన దైహిక శక్తిని
దోచుకొనుట యెట్లు దోషమగును?
దిట్ట మెందుకయ్య దేవుని సొత్తుకు?
కంటి నలుసుర పులికంటి మాట!

సూక్ష్మ మెరుగకుండ శోకించుటే తప్పు
నిష్ఠురోక్తులాడ నేరమగును
మర్మమెరిగి గాదె మనకు ప్రభువులైరి
కంటి నలుసుర పులికంటి మాట!

# మమత

మనిషి మనిషి మధ్య మమతాను రాగాలు
మట్టగించు చుండ మథన మిగిలె
నాగరకత మిత్తి నమలగా మమతను
కంటి నలుసుర పులికంటి మాట!

ఆలిప్రక్క చేర అమ్మమీది మమత
సొక్కి సోలిపోవు ప్రక్కకింద
తల్లిమమత మటుకు తరగని ముల్లెరా
కంటి నలుసుర పులికంటి మాట!





మోహ వాంఛ లోనె మొలకెత్తె మనరూపు
రూపు దిద్దు కొనగ దాపు మమత
మమత లేని నాడు మనుగడ బీడురా
కంటి నలుసుర పులికంటి మాట!

కుళ్లు ఒళ్లు మరచి కులికించ మనసును
మాట మాటకింత మమత పులిమి
మోసపుచ్చ తలచ ముంగాలు గుంతలో
కంటి నలుసుర పులికంటి మాట!

ఆలుమగల మధ్య అసలు బిడ్డల మధ్య
చెలిమి మధ్య వలచు చెలియ మధ్య
వీగినేని మమత మాగవు బతుకులు
కంటి నలుసుర పులికంటి మాట!

మనసు మనసు నెరిగి మధురానుభూతిలో
కలిసి తేలిపోవ కలదు మందు
మమత మించినట్టి మందిల లేదురా!
కంటి నలుసుర పులికంటి మాట!

# వనిత

ఆడకూతురనగ అల్లాడి పార్లాడి
వడ్లగింజ తంతు వైద్య మనగ
కుప్పతొట్టి గుండె కుమిలెను చూడరా!
కంటి నలుసుర పులికంటి మాట!

ఆడదాని కంటె అడవిలో చెట్టుగా
పుట్టవచ్చు కాని, పుట్ట రాదు
ఆడు పుట్టు వనగ, అర్థాలె మారెరా!
కంటి నలుసుర పులికంటి మాట!





తెలివి తేటలందు తెగువ చూపుట యందు
ఆట పాటలందు మాటలందు
వనిత తీరుమారె మగతనమ్ముమన మీరె
కంటి నలుసుర పులికంటి మాట!

ఆరితేరె వనిత అన్నిరంగము లందు
పేరు కీర్తు లెన్ని పెరిగె నేడు!
అబల సబల శివుడు ఔదల దాల్చడే?
కంటి నలుసుర పులికంటి మాట!

తల్లి చెల్లి అక్క తగు మగనాలిగా
పాత్ర పోషణమున పడసె నేర్పు
బతుకునందు వనిత బహుపాత్రధారిణి
కంటి నలుసుర పులికంటి మాట!

సృష్టి మాత వనిత చిన్నచూపు తగదు
వెలదిలేని చోట వెలుగు లేదు
వనిత లేనినాడు వరలదు జగతిరా!
కంటి నలుసుర పులికంటి మాట!

# కవిత

రాణివాస మందు రాజుల మెప్పుకై
పల్ల కెక్కి నట్టి పద్యకవిత
వీథి కెక్కి నేడు విశ్వశాంతిని కోరె
కంటి నలుసుర పులికంటి మాట!

అరయ కీర్తి ధనము లార్జింప, ఆనంద
మొసగ కీడు చేతలూడ గొట్ట
కవిత సాధనమను కాలము మారెరా
కంటి నలుసుర పులికంటి మాట!





భావమునకు భాష ప్రాణము పోయగా
తేనెలద్దు కొన్న తేట పలుకు
కవిత అనగ ఎదల కవ్వించు రూపమే!
కంటి నలుసుర పులికంటి మాట!

తట్టి పైకి లేపి తాడిత పీడిత
జనులబాధ తీర్చు సాధనముగ
చాలు వేయు కవిత సంఘసంగీతమే!
కంటి నలుసుర పులికంటి మాట!

బాధతత్త్వ మెరిగి పేదల పక్షాన
ఉన్నవాని బలుపు ఒలుచు కవిత
నిఖిల జగతియందు నీరాజనములందు
కంటి నలుసుర పులికంటి మాట!

ఉద్యమాలు లేక ఉన్నతి లేదురా
ఉద్యమమ్మె వచన పద్యమనగ
ఉద్యమాలకు కవి ఊపిరి కావలె !
కంటి నలుసుర పులికంటి మాట!

# కలత

నిండు సరసులోన నిర్మలమౌ నీట
గులక రాయి చాలు! అలల కలత
బతుకు సరసులోన బాధలె కలతరా!
కంటి నలుసుర పులికంటి మాట!

కలతపెట్టు మనసు కడుచిన్న దైనను
ఘటన, దాచుకొనగ నటన కాదు
కలత రూపమెరుగ కన్నీళ్లు సాక్షిరా
కంటి నలుసుర పులికంటి మాట!





కలత చెందవలదు కష్టాలు పైకొన
కష్టసుఖముల కలగలుపె బతుకు
కలత వలయు జన్మ కడతేరు దారికై
కంటి నలుసుర పులికంటి మాట!

కలత లేపవచ్చు కలిగిన వానిలో
సమ సమాజ శక్తి చాటిచెప్పి
ఎద్దుపుండు కాదు ముద్దురా కాకికి
కంటి నలుసుర పులికంటి మాట!

కదల మెదల లేని కాటిలో చితిచూడు
చలన రహితమైన శవము కాల్చు!
కలత కాల్చి వేయు కదలాడు మనిషినే
కంటి నలుసుర పులికంటి మాట!

కలయ చూడు జగతి కలతల పిడికిట
చిక్కి ఎంతమంది చితికినారొ?
కలత చెంద ఫలము కన్నీళ్ళు తుడువగా
కంటి నలుసుర పులికంటి మాట!

# నడత

అడుగుతీసి అడుగు అడుగిడ ముందుకు
నడక అగునె కాని నడతకాదు -
నడక నడతలందు నైపుణ్యమే వేరు
కంటి నలుసుర పులికంటి మాట!

నడక తీరు వేరు నడతతీరే వేరు
నడక పుట్టు చాలు నడత కాదు -
నడక హంసదైన నడత నాణెమగునె?
కంటి నలుసుర పులికంటి మాట!





నడక కుంటు కంటపడదురా గమ్యము
నడత కుంటుపడగ నవ్వుపాలు
నవ్వుపాలు బతుకు నడివీధి పాలురా
కంటి నలుసుర పులికంటి మాట!

నడత నాణ్యమైన నలుగురిలో మెప్పు
మెప్పులందు కొనగ ఒప్పు జగతి
జగతి ఒప్పినంత జన్మసార్థక మౌను
కంటి నలుసుర పులికంటి మాట!

సాధు వర్తనమ్ము సాధించు శాంతిని
శాంతి సొంతమైన భ్రాంతి వీడు
భ్రాంతివీడ మనసు పరమసత్య మెరుగు
కంటి నలుసుర పులికంటి మాట!

బట్ట మడత పడగ బాగుపరచ వచ్చు
భావమైన తరచి మార్చ వచ్చు
కుక్కతోక నడత కుదిరించ లేమురా
కంటి నలుసుర పులికంటి మాట!

# కులము

అమ్మ కడుపునందె అందరు సమముగా
పుట్టి జనులు పట్టినట్టి దారి
కులము రొంపియందె కులుకుచు నుండెరా
కంటి నలుసుర పులికంటి మాట!

మనిషి ముందుపుట్టి మరలపుట్టె కులము
వృత్తి పేరుమీద నృత్య మాడె!
ఊసుపోయె వృత్తి ఊపందె కులమురా
కంటి నలుసుర పులికంటి మాట!





నీవు నేనుతాగు నీటికేల కులము
పీల్చుగాలి కులము పేరుచెప్పు?
తిరుగు నేల కెవరు తీర్చిరి కులమును?
కంటి నలుసుర పులికంటి మాట!

కులము వలన గుణము కుదరదు సత్యమే
గుణము వలన కులము గణనకెక్కు
మట్టి కడుపు నందె మాణిక్య ముండదా?
కంటి నలుసుర పులికంటి మాట!

రగిలి రగిలి తుదకు రక్తపాతమ్ములో
ముంచి తేల్చుకులము, పంచచేర్చి
పాలుపోసి పెంచు పద్ధతి మానరా!
కంటి నలుసుర పులికంటి మాట!

అంటురోగమైన పెంటరా 'కులగజ్జి'
చాపకింద నీటి చందమాయె!
మల్లెమనసు తగిన మందురా పొందరా!
కంటి నలుసుర పులికంటి మాట!

# హాలము

పొలమునందు హాలము పోరాడి పొరాడ
బుద్ధిజీవుల కిల బువ్వ దక్కు
నాడి ఆడినపుడె నరుల వైభోగాలు
కంటి నలుసుర పులికంటి మాట!

ఎవడొ రూపశిల్పి ఎన్నాళ్ళ మథనమో
కొయ్యకొక్క రూపు కూర్చగలిగె
మార్చు హాలము ఔర! మట్టిని బువ్వగా
కంటి నలుసుర పులికంటి మాట!



శిల్పి చేతిలోని శిలలు మాట్లడగా
కవులచేతి కలము భవితవైపు
రైతుచేతి హలము ప్రాణాలె నిలుపగా
కంటి నలుసుర పులికంటి మాట!



హలము చేతపట్టి పొలమును దున్నిన
కవియు చేతపట్టె కలము కూడ
రైతు వెతలు వదలి రాసెరా హరికథ
కంటి నలుసుర పులికంటి మాట!

చాలుపక్క చాలు చక్కగా సాగిన
చాలు రాసెగదర వీలునామ!
విప్పిచెప్ప కలము విలవిలలాడును
కంటి నలుసుర పులికంటి మాట!

అందిరాని పంట అప్పుల కుమ్ములో
నిలుప ఆత్మహత్య మలుపుకాదు
హలము చేతిలోని ఆయుధ మరయరా!
కంటి నలుసుర పులికంటి మాట!

# కలము

గద్ద-ఈక చెక్కి ఘంటముగా మార్చి
వ్రాసినారు ఘనులు రమ్యగతుల
కలము విలువ తెలియ కావ్యాలు చదువురా!
కంటి నలుసుర పులికంటి మాట!

మేడి పట్టవచ్చు మెలకువ కలిగిన
పట్టవచ్చు పాము పడగనైన
చేయవలయు తపసు చేపట్ట కలమును
కంటి నలుసుర పులికంటి మాట!





మెదడు పొలమునందు మెదలెడి భావాల
పంట నూర్చి పేర్చి పలుకు నేర్పి
జాలువార్చు కలము జనులు మెచ్చెడిరీతి
కంటి నలుసుర పులికంటి మాట!

నమ్ముకొన్న కలము నట్టేట ముంచదు
జాతి ప్రగతికింత జవముకూర్చు
నమ్మి అమ్ముకొన్న నవ్వుల పాలురా!
కంటి నలుసుర పులికంటి మాట!

నీతిభీతి లేదు నియమమా? అదిలేదు!
చెడుగుడాడు చుండె చెడ్డతనము
కలము కత్తిచేసి చెలగరా చెడుగును!
కంటి నలుసుర పులికంటి మాట!

కత్తిదెబ్బ మాన్ప కలదిల మందురా
కలము దెబ్బ పడగ కలదె మందు?
కత్తి దెబ్బకన్న కలము పోటే మిన్న!
కంటి నలుసుర పులికంటి మాట!

# బలము

కండబలము కలదు కలదని ఎవడైన
మిడిసి ఎగసి పడుట మేలు కాదు!
కండ బలముకన్న గుండెబలము మిన్న
కంటి నలుసుర పులికంటి మాట!

ధనము బలముకన్న దైవబలము కన్న
గుండె బలముకన్న కండకన్న
అసలు మనిషి బలము ఆత్మవిశ్వాసమే!
కంటి నలుసుర పులికంటి మాట!





అడుగు అడుగునందు ఆత్మవిశ్వాసము
బలము పుంజుకొనుచు భవితదిశకు
కదల మనుటె బలము! కాదురా కండలు
కంటి నలుసుర పులికంటి మాట!

అంధకారమందు అధికార బలమది
విర్రవీగుటెంత వెర్రితనము?
ఓటు బలము కత్తివేటురా బతుకులో
కంటి నలుసుర పులికంటి మాట!

బుద్ధిబలము వలన పుట్టెడు కీర్తుల
పొందవచ్చు ధనము చెందవచ్చు
నీతిబలమె నిన్ను నిలుపును మనిషిగా
కంటి నలుసుర పులికంటి మాట!

కులము బలము పెంట కుత్సితములతంట
వెంట పడుట ఎంత వింతసంత?
అసలు బలము కలదు ఐకమత్యము లోనె
కంటి నలుసుర పులికంటి మాట!

# జలము

సకల జీవరాశి సాక్షాత్తు జలములో
ఉద్భవించి వరలె ఉర్విపైన
పుట్టుకొసగు నీటి పుట్టుకే వింతరా
కంటి నలుసుర పులికంటి మాట!

ప్రాణదాత గాన పంచభూతము లందు
గంగ కిలను దక్కె గౌరవమ్ము
నీరులేని క్షణము నిలుచునా లోకమే?
కంటి నలుసుర పులికంటి మాట!





నాగరకత ప్రబల నదుల నీరమెసాక్షి
దేశచరిత పుటల తిప్పిచూడు
నదుల తీరమందె నగరాలు వెలసెరా
కంటి నలుసుర పులికంటి మాట!

జలప్రవాహమందు జనియించు విద్యుత్తు
శక్తివలన మనిషి యుక్తి మీరె!
నీటి శక్తి యుక్తి చాటెరా ప్రగతిని
కంటి నలుసుర పులికంటి మాట!

కులముపేర చెంబు కులుకుచు నుండగా
చేరి చెంబు కులము మారె గంగ
గంగ ప్రకృతివరము! గంగకేల కులము?
కంటి నలుసుర పులికంటి మాట!

నోరు ప్రగతి కొరకు నీరు ప్రాణానికే
మూలమనెడు సూక్తి బోధపడిన
వాలుచాలు నీటి వాటమే బతుకురా
కంటి నలుసుర పులికంటి మాట!

# తలపు

అంధకారమందు అలమటించి మనిషి
వెలుగు కొరకు వెదకె వేలయేండ్లు
తలపునందె వెలుగు తాదాగి యుండగా
కంటి నలుసుర పులికంటి మాట!

తలపు లోనె పుట్టి తలపులోనె పెరిగి
వెలుగు మూలమాయె వెతలుమాన్ప
తలపు మహిమముందు తలలె వాలిపోవు
కంటి నలుసుర పులికంటి మాట!





తలలతీయు, ఊపు తలల, తేల్చుకలల
మార్చుతలల, తగవు కూర్చుతలపు!
తలల తీరు ఒకటె! తలకొక్క తలపురా!
కంటి నలుసుర పులికంటి మాట!

మనిషి మనుటలోన మంచిచెడులటన్న
భిన్నభిన్న గతులు సున్నసున్న!
మనిషి తలపునందె మంచిచెడులు పుట్టు!
కంటి నలుసుర పులికంటి మాట!

జైన బౌద్ధ హిందు జాతుల భేదాలు
సృష్టిలోన లేవు దృష్టి తప్పు
తలపులోనె జాతి తగదని తెలియరా!
కంటి నలుసుర పులికంటి మాట!

తలపు మంచిదైన తరతరాలకు మేలు
చెడ్డదైన తలపు చేటు తనకె!
మంచి తలపె మనిషి ప్రగతికి బాటరా!
కంటి నలుసుర పులికంటి మాట!

# మలుపు

ఎంతచిన్న పలుకు ఈరేడు లోకాల
గతుల మార్చ గలుగు గట్టి ములుకు
మలుపు విలువ తెలియ మనిషికి శక్యమే
కంటి నలుసుర పులికంటి మాట!

మనిషి జన్మమెత్తి మసలు వాడెవడైన
మలుపుబారి నుండి తొలగలేడు
మలుపులేని బాట మహినుండ బోదురా
కంటి నలుసుర పులికంటి మాట!





చక్కనైన మాట చక్కని నడవడి
మలుపు, మనిషి దశల మార్పుచేయు
బాటమలుపు తిరుగ మారవా దిశలైన
కంటి నలుసుర పులికంటి మాట!

కథకు మలుపులున్న కడురమ్యమై ఒప్పు
మాట మలుపు లున్న మథన పెట్టు
బాట మలుపులున్న భయపెట్టు చుండురా
కంటి నలుసుర పులికంటి మాట!

పాటమలుపు తిరుగ పల్లవి పలుకును
బాట మలుపు తిరుగ పడదు కంట
బ్రదుకుబాట మలుపు భావింపలేమురా?
కంటి నలుసుర పులికంటి మాట!

వాదునందు మలుపు వీథికొక్క మలుపు
తగవుకొక్క మలుపు తప్పకుండు
ఓటు మలుపు మటుకు ఊహింపలేమురా!
కంటి నలుసుర పులికంటి మాట!

# వలపు

అక్షరాలు మూడు అన్నియు లఘువులే
కలిపి పలికి చూడు ఉలికి పాటు
తలపు మలుపులందు తైతక్క లాడించు
కంటి నలుసుర పులికంటి మాట!

కుదురుగ నొకచోట కూర్చుండ నివ్వదు
ఎగిరి గంతు లిడగ ఏవగించు
గంతులిడును గుండె గడుసరి లేగయై
కంటి నలుసుర పులికంటి మాట!





గుండె గుండెలోన గూడుకట్టు కొనిన
వలపు మహిమలెన్న వల్లగాదు -
నిప్పులేక నిన్ను నిలువున కాల్చురా
కంటి నలుసుర పులికంటి మాట!

తేనెచినుకు వలపు తీదీపురుచులను
మరగినట్టి మనసు తిరుగు తీరు
ఊహలందు తేలి ఉ(ద్రూత లూగించు
కంటి నలుసుర పులికంటి మాట!

వలచుటేమి గొప్ప వలపించు కొనుటలో
ఉన్న తీపితీరు లెన్న తరమె?
బువ్వపెట్టు తృప్తి బొక్కిన చిక్కునా?
కంటి నలుసుర పులికంటి మాట!

వలపుతీపి మరగి వదలి సాంఘికనీతి
కుక్కవోలె తిరిగి కుప్పకూలి
చేత చిప్ప చూచి చింతిల ఫలమేమి?
కంటి నలుసుర పులికంటి మాట!

# పిలుపు

అలది అలది కొంత అనురాగ రసమును
పిలిచినట్టి పిలుపు ప్రీతి గొలుపు
పెదవి వత్రసుడులు పొదుగునా పిలుపును?
కంటి నలుసుర పులికంటి మాట!

పిలుపు తప్ప దనుచు పిలిచిన పిలుపులో
మాట మిగులుకాని - మనసు లేదు!
మెరుగుపెట్ట రాగి మెరయునా కనకమై
కంటి నలుసుర పులికంటి మాట!





సమ్మె చేయు పిలుపు దొమ్మికొక్క పిలుపు
కులమతాల పిలుపు కొత్త ఎత్తు
చెలియ పిలుపులోని గిలిగింత పైఎత్తు
కంటి నలుసుర పులికంటి మాట!

కడుపు చేతపట్టి కష్టించు జీవుల
దోచు కొనెడు ఘనుల దుంపతెంచ
అడవి కడుపు లోని అన్నల పిలుపురా!
కంటి నలుసుర పులికంటి మాట!

మాల మాదిగలని మనుజుల విభజించి
కులము రొంపిలోన కుక్కి పెట్ట
తగదు తగదటంచు దళితుల పిలుపురా!
కంటి నలుసుర పులికంటి మాట!

ఎవరు పిలిచినారు ఎందుకు పిలిచిరో
తరచి చూడకుండ పరుగులెత్తు
పిచ్చిజనుల నాడి పిలుపులో తెలియరా!
కంటి నలుసుర పులికంటి మాట!

# కలుపు

కలుపు అనగ చేయికలువు మనుటగాదు
కలుపు అనగ కల్తి కతల వెతలె?
కల్తిలేని చోటు కలనైన కనలేము
కంటి నలుసుర పులికంటి మాట!

కన్ను కత్తరించి కలగల్సి పైరుతో
ఎదురు మదురు లేక ఎదిగి కలుపు
పంట కడుపు గొట్టు పక్కలో బల్లెమై
కంటి నలుసుర పులికంటి మాట!





పంటలోన కలుపు పనిగట్టుకొని పీకి
పారవేయ వచ్చు పంట హెచ్చు!
మనసులోని కలుపె? మనిషి తరముగాదు
కంటి నలుసుర పులికంటి మాట!

వలపులందు కల్తి తలపులందును కల్తి
నోట్లలోన దొంగనోట్ల కల్తి
ఓట్లలోని కల్తి ఊహింప లేమురా
కంటి నలుసుర పులికంటి మాట!

భాష కల్తి అనగ దోషమనగ రాదు
శైలి కల్తిఅగుట సహజమాయె
భావమందె కల్తి భావింప లేమురా!
కంటి నలుసుర పులికంటి మాట!

కలుపు చేయి చేయి కలుపును పీకగా
కలదు కలదు సుఖము వలయునంత
తలను కడిగి పొందు తన్మయమ్మెన్నరా?
కంటి నలుసుర పులికంటి మాట!

# గెలుపు

అంత ఇంతకాదు అణువణువున శక్తి
నింపుకొన్న పలుకు నిజము గెలుపు!
కుంటి వాడు కూడ కులుకురా గెలుపుతో
కంటి నలుసుర పులికంటి మాట!

ఆట పాటలందు పోటీలు పడవచ్చు
మాట గెలుపు కూడ మనిషి ప్రతిభ
ఔర! ఓటుగెలుపు అవినీతి బురదలో
కంటి నలుసుర పులికంటి మాట!





అదుపు చేయవచ్చు ఆకలి దప్పుల
నిద్రనైన గెలిచి నిలువ వచ్చు
అలవి కాదు గెలువ ఆశను మాత్రము
కంటి నలుసుర పులికంటి మాట!

యుద్ధమందు గెలుపు బుద్ధిలేనితనమె
జూదమందు గెలుపు జోలికొరకె!
విద్యలందు గెలుపు విలువలు పెంచగా
కంటి నలుసుర పులికంటి మాట!

కాదు కాదు గెలుపు కాదురా ముఖ్యము
గెలుపు తీరుబట్టి విలువహెచ్చు
అడ్డదారి గెలుపు అందిన ఫలమేమి?
కంటి నలుసుర పులికంటి మాట!

లౌకికపరమైన లంపటముల నుండి
నాదినాది యనెడు వాదు నుండి
నిన్ను నీవు గెలువ నిజమైన గెలుపురా!
కంటి నలుసుర పులికంటి మాట!

# పలుపు

గొడ్డు గాటకట్ట కూర్చిన దారము
పలుపు, కాని దాని విలువ లరసి
విప్పిచెప్ప చాల వింతగా తోచును
కంటి నలుసుర పులికంటి మాట!

ఆలుమగల మధ్య అపురూపమైనట్టి
వలపుమధ్య మంచి తలపుమధ్య
బంధమైన పలుపు అందమే అందము!
కంటి నలుసుర పులికంటి మాట!





మేళతాళ మంత్ర మేళనమ్ముల మధ్య
బొటనవేలు తొక్కి బొట్టుపెట్టి
ఆలిమెడను గట్టు తాళియే పలుపురా
కంటి నలుసుర పులికంటి మాట!

స్నేహ మధురిమ లరచేతులందు జవిరి
గుండెపొరల మీద కుమ్మరించి
గుండెగుండె చేర్చి పండించు బతుకుల
కంటి నలుసుర పులికంటి మాట!

ఇచ్చవచ్చి నటుల ఇంగితమ్మును వీడి
తిరుగునట్టి మనసు తీరుమార్చ
అందమైన పలుపు ఆత్మవిశ్వాసమే!
కంటి నలుసుర పులికంటి మాట!

పలుపు తెంపుకొనుచు పారిపోయెడి గొడ్డు
దొంగగొడ్డు దానిత్రోవ వేరు!
పలుపు తెంపుకొనుట పద్ధతి కాదురా!
కంటి నలుసుర పులికంటి మాట!

# నలుపు

నలుపు అనగ పట్టినలుపుటయే గాదు
నలుపు అనగ రంగు - నైజమరయ
కాలమందు సగము కబళించు చుండెరా!
కంటి నలుసుర పులికంటి మాట!

కంట పడగ నలుపు కనుబొమ ముడిపడు
మనసు నలుపు తిరుగు మాట విరుగు
నలుపు వలనగాదె? వెలుగు విలువహెచ్చె!
కంటి నలుసుర పులికంటి మాట!





దొరలు దొరకినన్ని దోపిడి మార్గాల
దోచుకొన్న ధనము దాచుకొనగ
సహకరించు నలుపు సామాన్యమైనదా?
కంటి నలుసుర పులికంటి మాట!

కొవ్వుపట్టి కాదు కూటికి పాల్మాలి
కొంగు పరచి వెరచి కుములుతున్న
చీకటి బ్రదుకులకు చెలికాడు నలుపురా!
కంటి నలుసుర పులికంటి మాట!

కన్నెకురులు నలుపు కంటిపాప నలుపు
చుబుకమందు దిష్టిచుక్క నలుపు
కనుల అందగించు కాటుక నలుపురా!
కంటి నలుసుర పులికంటి మాట!

నలుపు నలుపు అనుచు నవ్వుట సరిగాదు
చేతులెత్తి మొక్కు శిలలె నలుపు
కడకు నలుపె మనల కౌగిట చేర్చురా!
కంటి నలుసుర పులికంటి మాట!

# అల

నీటి నిశ్చలతను నిమురగా గాలులు
పులకరించు నీట పుట్టె అలలు
అలలు నీటికలలె ఆనంద ముప్పొంగ
కంటి నలుసుర పులికంటి మాట!

అలల వీవన లవి ఆడగా సయ్యాట
పిల్ల తెమ్మెర లవి ఉల్లమందు
పెంచి భావరీతి పంచురా అనుభూతి
కంటి నలుసుర పులికంటి మాట!





అలల గమనమందు అంతరార్థమెరిగి
మాట అలను చేసె మనిషి తెలివి
మాట అలలు సాగి మారెరా వార్తగా
కంటి నలుసుర పులికంటి మాట!

మెదడు పొరల అరల నొదిగిన భావాల
అలలు మార్పుచెంద అక్షరాలు
అక్షరాల విరులె అవి కావ్యరూపాలు
కంటి నలుసుర పులికంటి మాట!

అలలు ఎప్పుడైన అలిగిన సమయాన
తారుమారు జగతి తల్లడిల్లు
అలుగు జోలికేగ అపనింద పాలురా!
కంటి నలుసుర పులికంటి మాట!

మిడిసి మిడిసి పడుచు మింటిపై కెగురుచు
అంతలోనె విరుగు అలల ఘోష
బతుకు మిథ్య అనుచు భావింప మన్నవి
కంటి నలుసుర పులికంటి మాట!

# వల

నీటి లోన చేప నేలపై తిరుగాడు
జంతువులను పక్షిజాలములను
వంచనమ్ము చేయ వలపుట్టె మహిలోన
కంటి నలుసుర పులికంటి మాట!

నోరులేని జీవి నోరుగొట్ట - మనిషి
తెలివియందు పుట్టె వలల పులులు
మనిషి ఎత్తుగడకు మచ్చులు వలలురా
కంటి నలుసుర పులికంటి మాట!





మాటదారములకు మధువును దట్టించి
పట్టు విడుపు నేర్చి పన్ని వలను
వంచనమ్ము చేయు వాడురా మొనగాడు
కంటి నలుసుర పులికంటి మాట!

ప్రేమసూక్తుల వల ప్రియమారగా పన్ని
వలపు గోతిలోన వంగదోసి
వదలి తిరిగి నపుడె వాటమెరిగి వాత
కంటి నలుసుర పులికంటి మాట!

పదవి కొరకు పన్ను పడతులె వలలైన
ఓట్లు తండు కొనగ నోట్లు వలలు
రాచపుండ్లు వలలు రాజకీయము లందు
కంటి నలుసుర పులికంటి మాట!

వలలు రంగుమారి వర్ధిల్లు చుండగా
బాధ తీరు మారు బతుకులందు
వలల వంచనమ్ము కలనైన వలదురా
కంటి నలుసుర పులికంటి మాట!

# కల

కనులు మూతపడగ కలల సామ్రాజ్యమే
పౌరసత్వమొసగి పన్ను వలను
కలల వలను పడగ కడతేర లేవురా
కంటి నలుసుర పులికంటి మాట!

ఒకతె కాళ్లు పట్ట ఒకతె వీవనవీయ
మధువు పాత్ర ఒకతె పెదవి కొసగ
ఊహ చాలు కలల ఊరించ మనసును
కంటి నలుసుర పులికంటి మాట!





ఢిల్లి గద్దె పైన ఢీకొని కూర్చొని
ఏలవచ్చు కలల తేలవచ్చు
కలల కున్న శక్తి కత్తికి లేదురా
కంటి నలుసుర పులికంటి మాట!

కనుటలెస్స కలల కమ్మని తీరులో
బతుకునందు కలలు భాగమె గద?
అద్దమందు బొమ్మ అదిచేత కందదు
కంటి నలుసుర పులికంటి మాట!

సాధనమ్ము చేసి సాధించ ప్రగతిని
కలలు గనుట లోన కలుగు మేలు
పగటి కలలు మటుకు ప్రాణాంత కమ్మురా
కంటి నలుసుర పులికంటి మాట!

కలల తేలియాడ కాలము చల్లగా
కరగిపోవు కాని తిరిగి రాదు
కార్యశూరు డెవడు కలలకు లొంగడు
కంటి నలుసుర పులికంటి మాట!

# కల

కనులు మూతపడగ కలల సామ్రాజ్యమే
పౌరసత్వమొసగి పన్ను వలను
కలల వలను పడగ కడతేర లేవురా
కంటి నలుసుర పులికంటి మాట!

ఒకతె కాళ్లు పట్ట ఒకతె వీవనవీయ
మధువు పాత్ర ఒకతె పెదవి కొసగ
ఊహ చాలు కలల ఊరించ మనసును
కంటి నలుసుర పులికంటి మాట!





ఢిల్లి గద్దె పైన ఢీకొని కూర్చొని
ఏలవచ్చు కలల తేలవచ్చు
కలల కున్న శక్తి కత్తికి లేదురా
కంటి నలుసుర పులికంటి మాట!

కనుటలెస్స కలల కమ్మని తీరులో
బతుకునందు కలలు భాగమె గద?
అద్దమందు బొమ్మ అదిచేత కందదు
కంటి నలుసుర పులికంటి మాట!

సాధనమ్ము చేసి సాధించ ప్రగతిని
కలలు గనుట లోన కలుగు మేలు
పగటి కలలు మటుకు ప్రాణాంత కమ్మురా
కంటి నలుసుర పులికంటి మాట!

కలల తేలియాడ కాలము చల్లగా
కరగిపోవు కాని తిరిగి రాదు
కార్యశూరు డెవడు కలలకు లొంగడు
కంటి నలుసుర పులికంటి మాట!

# తల

గోవునకును రెండు కొమ్ము లున్నట్లుగా
మనిషి మనిషికి తల మహిని కలదు
తలలు ఒక్కటైన తలపులు వేరురా
కంటి నలుసుర పులికంటి మాట!

జంతుజాలములకు జగతిలో మనిషికి
తలలె కలవు తారతమ్య మెరుగ
కాడు ఎవ్వడేని కలనైన జంతువు
కంటి నలుసుర పులికంటి మాట!





ఒక్క పిడికె డంత ఒదిగెరా తలలోన
కాలగతుల మార్చ మూలమాయె!
ప్రణయ ప్రళయ గతుల పాదురా మెదడురా
కంటి నలుసుర పులికంటి మాట!

నాగరకత మించు నరుల తలలయందె
మంచిచెడుల తలపు పొంచియుండు
తలపు మంచిదైన తలలె గణనకెక్కు
కంటి నలుసుర పులికంటి మాట!

కత్తి చేతికెత్తి కంఠాలు తెగవేసి
మార్పు కోర మనసు మార దెపుడు!
తలలు నరకినంత తత్వాలు మారునా?
కంటి నలుసుర పులికంటి మాట!

ఔర! ఆత్మహత్య నేరమై నపుడురా
నేర మెటులకాదు ఘోరహత్య?
తలలు తీయువాని తల ఒకటుందిరా!
కంటి నలుసుర పులికంటి మాట!

# వెల

అమ్ముకొనగ తలచి అంగడిలో పెట్టు
సరకు నాణెమునకు సాక్షి వెలలు
ఇలను గుణములెన్ని వెలకట్టలేనివి?
కంటి నలుసుర పులికంటి మాట!

చిక్కి బాధలందు బిక్కరించెడి వాని
చెంతచేర్చి వెతల చింత దీర్చ
ఇలను వాని గుణమె వెలకట్ట లేనిది
కంటి నలుసుర పులికంటి మాట!





చెప్పుమాట ఒకటి చేతలు వేరుగా
కాక మాటపైన కట్టుపడగ
ఇలను వానిరీతి వెలకట్ట లేనిది
కంటి నలుసుర పులికంటి మాట!

తప్పు లెన్న కుండ తనతప్పు గ్రహియించి
ధర్మ మార్గమరయు కర్మయోగి
ఇలను వానితీరు వెలకట్ట లేనిది
కంటి నలుసుర పులికంటి మాట!

అక్షరమ్ము నొకడు ఆయుధమ్మును చేయ
గీతలందు ప్రాణదాత ఒకడు
ఇలను ఇట్టి నేర్పు వెలకట్ట లేనిది
కంటి నలుసుర పులికంటి మాట!

నిర్ణయించు వెలను నీవైన నేనైన
వింతలేదు కొనగ విలువ లేదు
విలువకలదు పొంద వెలకట్ట లేనివి
కంటి నలుసుర పులికంటి మాట!

# బడి

ఇసుక పలకచేసి విసుగు వసుగు లేక
వేలు బలప మనగ వేల సార్లు
అరగ దిద్ది నేర్చిరక్షరా లొకనాడు
కంటి నలుసుర పులికంటి మాట!

తావు కాలగతిని తాటాకు పొందగా
రచనసాగె ఎన్ని రమ్యగతుల
చరిత శిలలపైన శాసన మాయెరా
కంటి నలుసుర పులికంటి మాట!





ఆశ్రమాలు వెలసె అందాల బడులుగా
ప్రతిఫలమ్ము కోర రాదటంచు
ముడుపు కోరుకొనెడు మూఢులా గురువులు?
కంటి నలుసుర పులికంటి మాట!

అమ్మఒడిని వదలి అడుగిడ లోకాన
భవిత దారి కలదు బడినిచేర
అమ్మ ఒడినిమించు అందాలఒడి బడి
కంటి నలుసుర పులికంటి మాట!

బతుకు లేనివాడు బడిపంతు లన్నారు
వింతలందు వింత వినగ నేడు
తారుమారె సూక్తి తర్కించి చూడగా
కంటి నలుసుర పులికంటి మాట!

చదువు రీతు లరయ సంతలో సరుకాయె
కొన్నవాడె మిగిలి మిన్న యనగ
చదువ మనగ బడిని 'చదువుకొంటు'న్నారు
కంటి నలుసుర పులికంటి మాట!

# గుడి

రాతి నొకటి తెచ్చి రమ్యముగా చెక్కి
తప్పు దారులందు తావు పొంది
నిలిపి దేవుడనగ నిజమైన యుక్తిరా
కంటి నలుసుర పులికంటి మాట!

అడుగు కొక్క గుడిని అందముగా కట్టి
మరచినారు బడుల మాన్యవరులు
మూఢనమ్మకాలు ముక్తికి మార్గమా?
కంటి నలుసుర పులికంటి మాట!





గుడిని అడుగు పెట్ట గుడ్డిగా ఎవడైన
తన్మయత్వమంది తనను మరచు
ఎరుగు తన్ను తాను ఎవడైన బడిచేర
కంటి నలుసుర పులికంటి మాట!

కట్టుగుడ్డ లేక కడుపార తిండికి
నోచనట్టి జనుల నోర్లు కట్టి
రాళ్ల కెందుకయ్యె రమ్య హర్మ్యంబులు
కంటి నలుసుర పులికంటి మాట!

వండి వార్చి పెట్టు తిండి తీర్థములను
తినడు దేవుడనుచు తెలిసి మనిషి
ఔర! సాటిమనిషి ఆకలి ఎరుగడు
కంటి నలుసుర పులికంటి మాట!

మొండినమ్మకాలు ముదిరిన మేరకు
ఏలు వారి కెపుడు ఎదురు లేదు!
గొర్రె కొవ్వినంత గొల్లకు మేలురా
కంటి నలుసుర పులికంటి మాట!

# ముడి

దారమనగ ముడులు తప్పవు సరిగదా
వేసినట్టి ముడిని విప్పవచ్చు
జుట్లు ముడులువేయ చూడరా చోద్యము
కంటి నలుసుర పులికంటి మాట!

మునపడు ఎవడైన ముడులు వేయగ జుట్లు
కొంప కుప్పకూల కులుకు చుండు
మనసు మనసు ముడిని మరి ఒప్ప లేదురా
కంటి నలుసుర పులికంటి మాట!





కురుల సిరులై ముడులు కుదిరిన వేళల
ముడిని పూలు ముడువ ముదము గొలుపు
తావె ఎవడికైన తగినంత గుర్తింపు
కంటి నలుసుర పులికంటి మాట!

మాట ముడులు పడగ మనసులు దూరమౌ
రాత ముడులు పడిన రోతపుట్టు
చర్మమందు ముడులు సౌందర్య లోపమే
కంటి నలుసుర పులికంటి మాట!

నాడు ఒక్కడుండె నారదు డనుపేర
గిల్లి ముడులు పెట్టు కేటుగాడు
అడుగు కొకడు నేడు అతనికంటె ఘనుడు
కంటి నలుసుర పులికంటి మాట!

ఉప్పు ఎచట పుట్టె ఉసిరిక ముడిపడ
పంచునట్లు రుచులు పంచుకొనగ
సాక్షి మూడుముడులె సంసార యాత్రలో
కంటి నలుసుర పులికంటి మాట!

# అప్పు

అప్పుచేయ తప్పు అది తెచ్చుగద ముప్పు
అనెడు మాట వింత వినుట గాదె!
అప్పు తెచ్చుటన్న అదిగొప్ప కళగదా?
కంటి నలుసుర పులికంటి మాట!

చెప్పలేని కన్నతిప్పలు పడిఅప్పు
తెచ్చుకొనగ లగువు తీర్చ బిగువు
తేరకు తినువాడు తెంపుగా పెట్టడు
కంటి నలుసుర పులికంటి మాట!





దేవుడప్పు చేసె దేశాలు చేసెను
శ్రమను దోచెడి పరిశ్రమలు చేసె
అప్పు చేయువాడె అధిక సంపన్నుడు
కంటి నలుసుర పులికంటి మాట!

తప్పు చేయకుండ తాకట్టు పెట్టక
నెట్టవచ్చు బ్రతుకు మట్టసముగ
అప్పు చేయకుండ అబ్బల తరమౌనె?
కంటి నలుసుర పులికంటి మాట!

బంధమందున ఋణబంధమే బంధము
తెంపుకొనెద మనిన తెగని తంట
సందియమ్ము తీర్చ సాక్షాత్తు వెంకన్న
కంటి నలుసుర పులికంటి మాట!

అప్పుపుట్ట తెచ్చి అందిన మేరకు
పప్పుకూడు కుడువ పాడిగాదు!
అప్పు కూటికన్న అతిరుచి గంజిరా!
కంటి నలుసుర పులికంటి మాట!

# తప్పు

తప్పుచేయకుండ తడువక వానలో
మనగ లేడు ఎట్టి మాన్యుడైన
తప్పు ముందుపుట్టె తరువాత మనిషిరా!
కంటి నలుసుర పులికంటి మాట!

తప్పుచేసి; కాదు తప్పని వాదించు
మొండి జనుల మతము ఖండితముగ
గాలిలోన దివ్వె కదల దనెడు రీతి
కంటి నలుసుర పులికంటి మాట!





తెలిసి చేసిన మరి తెలియక చేసిన
తప్పు తొప్పికాని ఒప్పుకాదు
మసిని పులుమ గుడ్డ మరక గాకుండునా?
కంటి నలుసుర పులికంటి మాట!

హాలము నడక తప్పు కలముచేసెడుతప్పు
తివిరి కుంచెతప్పు దిద్దవచ్చు
ఓటు చేయు తప్పు కాటురా బ్రతుకులో
కంటి నలుసుర పులికంటి మాట!

జాతి మేలుకోరి నీతిని సమకూర్చు
నల్లకోటె! దాని నైజ మరయ
తప్పు లెన్ని నేర్పు తగునె ఈ న్యాయము?
కంటి నలుసుర పులికంటి మాట!

ఎదుటి వాడి తప్పు ఎత్తిచూపెడు బుద్ధి
తప్పు తనది మటుకు ఒప్పుకొనదు!
వేలుచూప నాల్గువేళ్లురా నినుచూప
కంటి నలుసుర పులికంటి మాట!

# ఉప్పు

ఉప్పు ఎక్కువైన తప్పదు రోగము
తక్కువైన రుచులు తగ్గగాదె?
ఉప్పు తత్త్వమరయ చెప్పరా మనిషికి!
కంటి నలుసుర పులికంటి మాట!

కటిక పేద అయిన కలిగిన వాడైన
మారదుప్పు గుణము మనిషి బట్టి
ఎంత దొడ్డ గుణము? ఎరుక నీకున్నదా?
కంటి నలుసుర పులికంటి మాట!





ఉప్పు రాతికైన ఉపయోగ పడదని
పోల్చు నానుడి సరిపోల లేదు!
చరితకెక్కె ఉప్పు సత్యాగ్రహామె సాక్షి
కంటి నలుసుర పులికంటి మాట!

ఉప్పులేని కూర ఉట్టిపై కెక్కదు
మలుపు లేని కథకు విలువ లేదు
గుణము లేని వాడు గణనకెక్కుట కల్ల
కంటి నలుసుర పులికంటి మాట!

ఆలుబిడ్డలైన ఆత్మీయు లెవరైన
కాటి వరకె తోడు; కలుగు మాటె!
గుంతలోన తోడు గుణమున్న ఉప్పురా
కంటి నలుసుర పులికంటి మాట!

ఒకడి ఉప్పు తినుచు ఓర్వక వాడికే
గుంతతవ్వు గుణము కుప్ప కూలు
కొమ్మపైన నిలిచి కొమ్మనే నరకుట!
కంటి నలుసుర పులికంటి మాట!

## నిప్పు

కొమ్మ కొమ్మ రాపు అందు కొలువైన నిప్పురా
రాతి గుండెలందు రగులు చుండె!
పట్టుకొన్న మనిషి ప్రతిభకే జోహార్లు
కంటి నలుసుర పులికంటి మాట!

రాతినుండి వెడలి రాకెట్లు పంపగా
సహకరించు యుక్తి శక్తి నిప్పు
పాడెలెన్ని కట్టె లాడెను చేజిక్కి
కంటి నలుసుర పులికంటి మాట!





నిజము పలుకుటనిన నిప్పుతో పోల్చిరి
సత్యమైన మాటె! సాక్షి ఎవరు?
నిప్పు చరిత పుటలు వినిపించు కథలెన్నొ
కంటి నలుసుర పులికంటి మాట!

ఉప్పుకు కొరగాడు నిప్పు పెట్టగలడు
కంటి పాపనైన కత్తరించి
కొంపలెన్నికూలె? కుమిలెడు ఎదలెన్ని?
కంటి నలుసుర పులికంటి మాట!

నిప్పు ఉప్పుకూడ నిజముగా బ్రతుకులో
అవసరమ్మెకాని, అవియె కలిసి
గుణము పట్టియిచ్చె గుట్టుగా మనిషికి
కంటి నలుసుర పులికంటి మాట!

నిప్పు అనగ వేడి నీలోన నాలోన
దాగి ఉన్న వేడి సాగిపోవ
కట్టెబెట్టి కాల్చ కావలె నిప్పురా!
కంటి నలుసుర పులికంటి మాట!

# ముప్పు

ఎక్కడుండు ముప్పు ఏరీతి కలుగునో
చెప్పలేము ముడిని విప్పలేము
విడువకుండ జనుల వెంటాడు నీడలా
కంటి నలుసుర పులికంటి మాట!

జన్మకింత ఫలము జమచేయ సమకట్టి
కొంత మేలు చేయ కోరు వారె!
ముప్పు తిప్పలందు తెప్పగా తేలిరి
కంటి నలుసుర పులికంటి మాట!





మీసము మెలితిప్పి దోసము నెంచగా
కోరి కోరి ముప్పు కొనుటగాదె!
నైజమెరిగి కూడ నసతీ(్రట జోలేల?
కంటి నలుసుర పులికంటి మాట!

తప్పువలన ముప్పు తగదని తెలిసియు
ముప్పు తెచ్చుకొనెడి మూర్ఖుడెవడు?
ఎరను మింగు చేప ఎరుగదే గాలాన్ని
కంటి నలుసుర పులికంటి మాట!

తగదు తగదుర పొగ తగదురా సారాయి
తగదు మగువ జోలి తగదుగుట్క
ముప్పు ముసుగు తొడిగి ముంచురా నీకొంప
కంటి నలుసుర పులికంటి మాట!

ముప్పు తిప్పలుపడి ముడుపులు కట్టిన
ముప్పు తప్పుననుట మూఢమతమె?
ముందుచూపు ఒకటె ముప్పుకు ముకుతాడు
కంటి నలుసుర పులికంటి మాట!

# మెప్పు

మెప్పుకొరకు మనసు మెరమెరలాడిన
ధరను పెట్టికొనగ దొరకబోదు
మెప్పు పొందగలవు మెరుగైన కృషితీరు
కంటి నలుసుర పులికంటి మాట!

మాటతీరు జనుల మన్నన లందిన
నడత మడత పడక నాణెమైన
చేత తోడుపడిన చిగురించు మెప్పురా
కంటి నలుసుర పులికంటి మాట!





ఒకని మెప్పుకొరకు తికమక పడవద్దు
ఆత్మ మెప్పుపొంద అదియె ముద్దు
పెదవి పూత మెప్పు పెట్టని వాతరా
కంటి నలుసుర పులికంటి మాట!

దానగుణము లేదు ధైర్యమా అదిలేదు
ఒరుల బ్రతుకు చూచి ఓర్వలేవు
స్వార్థపరుల చెంత చేరదు మెప్పురా
కంటి నలుసుర పులికంటి మాట !

ఎవరి మెప్పుకోరి ఇనుడు వెలుగులిచ్చు
కాయలిచ్చు చెట్టు; కన్నతల్లి
పాలు గుడుపుటందు పరమార్థ మరయరా
కంటి నలుసుర పులికంటి మాట!

తల్లిమెచ్చు గుణము, తనపేరు నిలుపగా
గురువు మెచ్చు, ప్రతిభ కులము మెచ్చు
జాతికొరకు బతుక జగతియే మెచ్చురా!
కంటి నలుసుర పులికంటి మాట!

## ఓర్పు

పరుగులెత్తి పాలు పడయుట కంటెను
నిలిచి నీరు తాగ నేర్పు ఓర్పు
వరము ఓర్పు, మనిషి పరపతి పెంచగా-
కంటి నలుసుర పులికంటి మాట!

ఆత్రగాడి బుద్ధి అదిమట్ట మనితేలె
చేతకాని పరుగు చేటుతెచ్చు
పొంగినంత పొంగు పొయ్యిపాలే గదా?
కంటి నలుసుర పులికంటి మాట!





అందగలవు ఓర్పు ఆలోచనమ్మున
కీర్తి పొంద గలవు కృషిని బట్టి
చెందగలవు ముక్తి చేసెడి సేవలో
కంటి నలుసుర పులికంటి మాట!

ఒక్కమాట పడగ ఓర్వక ఈబుద్ధి
ఎదురు తిరుగ ఎంత పదురు పుట్టు
తెలిసి ఓర్చి గొడ్డు తేటను తాగును
కంటి నలుసుర పులికంటి మాట!

వక్కకొరికి నంత లెక్కన ఓపిక
పట్టిచూడు దాని ఫలితమెంతొ?
ధర్మరాజు ఓర్చి ధరణి పాలింపడే?
కంటి నలుసుర పులికంటి మాట!

ఓర్పు నేర్పు లరయ ఒకని సొత్తవికావు
సాధనమున పొంద సహకరించు
చీమ గురువుకాదె చేపట్టు పనులందు
కంటి నలుసుర పులికంటి మాట!

# నేర్పు

పలక ముందు పెట్టి బలపము చేపట్టి
నేర్ప అక్షరాలు నేర్పు కాదు
అక్షరాల ఒదుగు అందమే నేర్పురా
కంటి నలుసుర పులికంటి మాట!

మాటలందు నేర్పు మర్యాదలందగ
పనులయందు నేర్పు ఫలితమంద
నడత నేర్పు వలన నలుగురి మెప్పురా
కంటి నలుసుర పులికంటి మాట!





సాలెగూడు చూడు చాలదా గిజిగాని
గూడు చూడు నేర్పుగుట్టు తెలియ
ఎవరు నేర్పినారు ఏజన్మ ఫలితమో?
కంటి నలుసుర పులికంటి మాట!

శిల్పిచేతిని ఉలి చిత్రకారుని కుంచె
కవులచేతి కలము కలిసెననగ
ఇంద్రధనుసు జిలుగు ఏచేతి నేర్పురా?
కంటి నలుసుర పులికంటి మాట!

కడలి కట్టుబాటు గగనాన వింతలు
పుడమి కడుపు పండి పొరలు సిరులు
ఎవని నేర్పు వలన? ఎరుగను శక్యమే?
కంటి నలుసుర పులికంటి మాట!

ప్రగతి సాధనమ్ము పరిణామ క్రమములో
సూక్ష్మమెరుగ నేర్పు సూత్రధారి
పతనమందు మలుపు ప్రగతిగతిని నేర్పు
కంటి నలుసుర పులికంటి మాట!

# తీర్పు

వాటమైన తీవ్ర వాదోప వాదాల
తీరుబట్టి వెలయు తీర్పుజాడ
వాదమందు నేర్పు వరలగ తీర్పురా!
కంటి నలుసుర పులికంటి మాట!

మంచిచెడులు రెండు మనిషి చేపట్టిన
పనుల లోతు లరయ ప్రబలుచుండు
మంచిచెడుల మధ్య మౌనయుద్ధమె తీర్పు
కంటి నలుసుర పులికంటి మాట!



కప్పకు కరువుమన కాదన పాముకు
కోపమనెడు సూక్తి గుండె తాకి
తీర్పు చెప్పు మనగ తికమక పెట్టురా!
కంటి నలుసుర పులికంటి మాట!



ఒకని కొంపముంచి ఒకనిని తేల్చును
తీర్పు మహిమలెన్న తారుమారె!
కలదు పదును తీర్పుకత్తి కిరుగడల
కంటి నలుసుర పులికంటి మాట!

సకల జగతియందు సమతుల్య సంపత్తి
కూర్చునట్టి తీర్పు గుణమె ఘనత!
ఎగుడు దిగుడు లేని ఇలగమనమె సాక్షి
కంటి నలుసుర పులికంటి మాట!

ఒకని తీర్పు తీరు ఒకనితో మారును
యుక్తి వాదమందు రక్తిగట్టి
మట్టి తీర్పు కసలు మార్పది లేదురా
కంటి నలుసుర పులికంటి మాట!

# కూర్పు

అక్షరాల కూర్పు అభ్యుదయమునకు
పూలకూర్పు మాల మేళవింపు
మనసు మనసు కూర్పు మధురానుభూతిరా
కంటి నలుసుర పులికంటి మాట!

ఎన్నుకొనిరి జనులు చిన్నదే వేలును
వేలు వేలు కలిసె వేడు కలర
పసుపుతాడు కూర్పు పండుగై నూరేండ్లు
కంటి నలుసుర పులికంటి మాట!





కోరి విత్తనమ్ము కూర్పగా మట్టితో
ఊహ కందనట్టి వృక్షమగును
చిన్నదైన చాలు వన్నె కెక్కదె మేలు?
కంటి నలుసుర పులికంటి మాట!

అడవిచెట్టు పూలఅందమా? అక్కడే !
కొప్పునందు చేర కూర్చు ముదము
అడవి పూల వోలె అణగారి రెందరో ?
కంటి నలుసుర పులికంటి మాట!

ఉప్పు రుచిని కూర్చు పప్పును చేరగా
తప్పు కూర్చు శిక్ష తగనిపనుల
ముప్పు మెప్పు లైన ముడిపడె మాటతో
కంటి నలుసుర పులికంటి మాట!

ఆలుమగ లిరువురు అరయ ధృవములైన
కాపురమ్ము లందు కలదె రక్తి?
కాడిగిత్తలైన కనువిందు జగమందు
కంటి నలుసుర పులికంటి మాట!

# మార్పు

జీవకణము నుండి జీవిగా రూపొంద
యుగములెన్నొ గడిచె జగతియందు
జీవ లక్షణమ్ము జేకొట్టు మార్పులో
కంటి నలుసుర పులికంటి మాట!

మూగ సైగ మార్పు ముచ్చటౌ మాటగా
ఆకులవియె మొలకు; అన్నమైన
ఉచ్చి పచ్చితిండి ఉడక బెట్టుట మార్పు
కంటి నలుసుర పులికంటి మాట!





చలన రహితమైన జడపదార్థ మొకటె
మార్పు కోరకుండు మహిని చూడ
చలనమందు మార్పు సహజాతి సహజమే!
కంటి నలుసుర పులికంటి మాట!

నాగరకత ముదిరె నరుని నైపుణ్యమే
ఆకసమ్ము నైన అందుకొనెను
మార్పు కోరుటనిన మార్పది కాదురా
కంటి నలుసుర పులికంటి మాట!

ఒరుల కష్టమందు ఒక్కింత సాయమ్ము
మనసు నొవ్వకుండ మాట తీరు
నీతిభీతి కలుగ నిజమైన మార్పురా
కంటి నలుసుర పులికంటి మాట!

లౌకిక పరమైన లంపటముల చిక్కి
బిక్కరించు మనిషి చక్కబడడు
మారునేమొ బుద్ధి మట్టిలో కలిసిన
కంటి నలుసుర పులికంటి మాట!

# ముండ

ముండ ఎదురు పడెను ముంచెరా కొంపని
నింద మోపుటందు నిజము లేదు
నింద మోపువాడె నిజమైన చవటరా
కంటి నలుసుర పులికంటి మాట!

మగడు చావగానె మగనాలి ముండయా?
మగడు ముండకాదె మగువ చావ
ఎవడు విజ్ఞుడౌ ఎరుకను విడనాడ
కంటి నలుసుర పులికంటి మాట!





స్వార్థపరత మీద సహగమనము పేర
సతిని ఎక్కుమనిరి చితిని నాడు
తగని పనుల యందు మగజాతి ముందురా
కంటి నలుసుర పులికంటి మాట!

ముండమోపి కాదు ముత్తైదు వయినను
మనసు లొకటె కాని మారలేవు
కుములు టొకరివంతు కులుకు లింకొకరికా?
కంటి నలుసుర పులికంటి మాట!

కట్టు బొట్టు మార్చి కట్టడి చేసిన
మనసు కలలు గనుట మాన్పలేము
సాధువగునె నొసట సాదిన నామాల
కంటి నలుసుర పులికంటి మాట!

పసుపు కంకుమలతొ పాడెమీదికి చేరు
కలలు విఫలమైన కలతచెందు
మగువ మనసు తెలియ మగవాడు తలవంచు
కంటి నలుసుర పులికంటి మాట!

# రండ

మగువలందు ముండ మగజాతిలో రండ
లుందు రనెడు మాట ఉట్టికెక్క
ఇంగితమ్ము వీడ ఎవడైన రండరా
కంటి నలుసుర పులికంటి మాట!

రంకు బొంకు నేర్చి రాణించు ఎవడైన
రండ అనగ ఒప్పు, రాదు వాదు!
రగడకీడ్చు పనుల మొగలాయి రండరా
కంటి నలుసుర పులికంటి మాట!





భర్తృహీన సతిని భావింప ముండగా
వదలి సతిని బతుకువాడె రండ!
రండ బతుకులందు రాణింపు లేదురా
కంటి నలుసుర పులికంటి మాట!

గుణము కలిగెనేని గుర్తింపు ముండకు
కార్యదీక్ష కలిగి గణనకెక్కు
ముండకున్న విలువ రండకు లేదురా
కంటి నలుసుర పులికంటి మాట!

ముండమోపులు తగ ముత్తైదువ లనిరి
పురుషులందు ముందు వరుస నిలిచి
రండ బతుకు లెపుడు రాలేవు ముందుకు
కంటి నలుసుర పులికంటి మాట!

ముండ మోయుటనగ మూలమే విధిగద
విధికి మారులేదు పృథివిలోన
రండ పేరు పడయు రాత నీచేతరా
కంటి నలుసుర పులికంటి మాట!

# కండ

కండ కలుగ మనిషి! కవి వాక్కుగద నాడు
వాక్కు కవిది కాన వలయు కండ
కండవాపు బలుపు కాదది కండరా
కంటి నలుసుర పులికంటి మాట!

కండ లనగ మాంసఖండంబు లవికావు
కండ పొంది నట్టి కలిమి శక్తి
శక్తి సాహసముల సాక్షిరా కండలు
కంటి నలుసుర పులికంటి మాట!





కండ లుండ వచ్చు కంటికి దొరగా
కండ పెరిగి నంత కలదె శక్తి
తెగువలేని కండ తెగని కత్తికి దీటు
కంటి నలుసుర పులికంటి మాట!

చచ్చి చెడిన సకల జంతు జాలాదుల
కండ మెక్కుటందు కలవె రుచులు?
కలదు మేనకండ కంటికి పడదేల?
కంటి నలుసుర పులికంటి మాట!

కవితలందు కండ కలకండ మరపించు
మాటలందు కండ మంత్రశక్తి
చేతలందు కండ చేకూర్చు ప్రగతిరా
కంటి నలుసుర పులికంటి మాట!

కండకావరమున కన్నును మిన్నును
కానకుండ తిరుగ కంపు బతుకు
గుండె మంచిదైన గుర్తింపు కండకు
కంటి నలుసుర పులికంటి మాట!

# ఎండ

పుడమిపైన వెలుగు పొడసూపి నంతనే
చలన మందు కొనును సకల జగతి
వెలుగు లేని నాడు విశ్వమే లేదురా!
కంటి నలుసుర పులికంటి మాట!

వెలుగు అనగ ఎండ చలనశక్తికి అండ
ప్రాణికోటి కెల్ల ప్రాణదాత
ఎరుకలేని జనము ఎండను మెచ్చరే
కంటి నలుసుర పులికంటి మాట!





ఎండ కాయకున్న ఏమౌను లోకము
కుళ్లి కంపు కొట్టి కుప్పకూలు
ప్రకృతి వరము ఎండ పరమౌషధము పండ
కంటి నలుసుర పులికంటి మాట!

మంచిచెడులు రెండు మనిషిలో ఉన్నట్లు
వెలుగు చీకటులిల వెలయుచుండు
నలుపు వలనకాదె? తెలుపు రాణించును
కంటి నలుసుర పులికంటి మాట!

ఎండ వానలనక కండలు పిండుచు
మట్టి బువ్వ చేసి పెట్టు రైతు
ఎవ్వడేది మెక్క ఎండలో పుట్టెరా
కంటి నలుసుర పులికంటి మాట!

ఉల్లి మల్లె మీద ఒకటిగా ప్రసరించు
ఎండ భేద భావ మెరుగ దెపుడు
అన్నమయ్య నోట అమృత వాక్కది గదా?
కంటి నలుసుర పులికంటి మాట!

# దండ

దండ అనగ పూలదండయే కాదురా
అండదండ లందు దండ కలదు
అండదండ లమర అదె పూలదండరా
కంటి నలుసుర పులికంటి మాట!

పూసలైన కాని పూవులైనను కాని
దండ కూర్చ వచ్చు తగిన రీతి
నిముసమైన చాలు నీరాజనము దండ
కంటి నలుసుర పులికంటి మాట!





మనసుపెట్టి పూలు మాలగా కట్టిన
భక్తి భావమునకు భాష దండ
పూలమనసు పుణికి పుచ్చుకొనగ మేలు
కంటి నలుసుర పులికంటి మాట!

దండ మెడనువేసి దండాలు పెట్టిన
మనసు అంతుపట్టు మనిషి తరమె?
దండవేసి దండధరుడైన గండమే
కంటి నలుసుర పులికంటి మాట!

పూలు కోసి తెచ్చి పూమాలగా కట్ట
పాడె కైనను పరమాత్మ కైన
తావు మారినంత తత్త్వాలు మారునా
కంటి నలుసుర పులికంటి మాట!

పూలదండ చేరి పులకించు దారము
శివుని శిరముపైన చీమకులుకు
సఫల మగును జన్మ సజ్జన మైత్రితో
కంటి నలుసుర పులికంటి మాట!

# జండా

తుండు గుడ్డమీద తోచిన భావాల
రూపములకు చిత్రరూప మొసగ
జాతివిలువ చాట జండాలు వెలసెరా
కంటి నలుసుర పులికంటి మాట!

మనుజ తత్త్వములకు మార్గాలు వేరైన
పార్టికొక్క జండ ప్రబలె జగతి
పార్టి లెక్కువాయె ప్రాణాంత కమ్మాయె
కంటి నలుసుర పులికంటి మాట!





ఎన్ని పార్టి లున్న అన్నిరా జండాలు
పుట్టగొడుగు లనగ పుట్టి సమసె!
జాతికొకటె నిలుచు జాతీయ జండాగ
కంటి నలుసుర పులికంటి మాట!

భరత దేశమునకు బానిస బంధాలు
తెంపి తరిమికొట్ట తెల్లదొరల
ఎఱ్రకోట మీద ఎగిరెరా మనజండ
కంటి నలుసుర పులికంటి మాట!

నవరస భరితమ్ము నాదేశ చరితమ్ము
మూడు రంగులందు మురిసి వెలుగ
ధర్మచక్ర సుగత మర్మమ్ము తెలియరా
కంటి నలుసుర పులికంటి మాట!

కులమత పరమైన కుళ్లను నిరసించి
ప్రాంత తత్త్వములకు పాడెకట్టి
ఎగిరినపుడె జండ ఎనలేని కీర్తిరా
కంటి నలుసుర పులికంటి మాట!

# కన్ను

ఇంద్రియమ్ము లిన్ని ఈదేహ మందుండ
కన్నుకున్న విలువ ఎన్నతరమె?
కనులులేని బతుకు కలనైన తలపకు
కంటి నలుసుర పులికంటి మాట!

తప్పుచేసి నపుడు తగవులాటల యందు
దొంగతనము చేసి దొరకనపుడు
ఒరుల కంట పడక పరుగిడమను కన్ను
కంటి నలుసుర పులికంటి మాట!





అందమైన పడుచు అగుపడి నంతనే
జుర్రుకొనగ మనసు జూలువిప్పు
కంటి కప్పగించి కనవలె ఫలితము
కంటి నలుసుర పులికంటి మాట!

ప్రకృతి శోభ గాంచి పరవశించును కన్ను
వికృతమైన చూడ విసుగుచెందు
మౌన భాషతోనె మాట్లాడురా కన్ను
కంటి నలుసుర పులికంటి మాట!

కలత చెందినపుడు కలిగించుకొని కన్ను
తడిగ కరిగి జారి తడుపు గుండె
చెలిమి విలువ తెలియ చెప్పెరా సూక్ష్మము
కంటి నలుసుర పులికంటి మాట!

కంటి పాప నైన కత్తిరించెడు నేర్పు
కలిగినట్టి మనిషి కన్నులుండి
చూడలేడు మనిషి కీడైన మేలైన
కంటి నలుసుర పులికంటి మాట!

# మన్ను

మన్ను అనగ మట్టి మట్టి అనగ ధూళి
ధూళి దూసరమని గేలిసేయ
మూతి మీద కొట్టు మొనగాడు రైతురా!
కంటి నలుసుర పులికంటి మాట!

కాలి కొలది తొక్కి కాకరించి ఉమిసి
కల్మషంబు చేయ కలత పడదు
మట్టికున్న ఓర్పు మనకెటు లుండురా?
కంటి నలుసుర పులికంటి మాట!





తప్పు కొలది చూడు తరగని సంపద
మట్టి కడుపు నందె మహిత శక్తి
సృష్టికర్త ఎవడు చేయెత్తి మొక్కరా
కంటి నలుసుర పులికంటి మాట!

కత్తులెన్ని లేచె కుత్తుక లెత్తిపడె
చరిత పుటలె సాక్షి తరచి చూడ
ఇంత ఘోరచర్య ఈమట్టి కొరకెరా
కంటి నలుసుర పులికంటి మాట!

చుట్టి తన్నుతాను సూర్యుని చుట్టును
చుట్టుతున్న భూమి పట్టుతప్పి
తల్లకిందు లైన తరువాత గతిఏమి?
కంటి నలుసుర పులికంటి మాట!

మట్టితత్త్వ మరయ మనుజులు ఒక్కటే
తారతమ్యములను తరిమికొట్టి
కడకు కడుపుచేర్చి కడతేర్చు సమముగా
కంటి నలుసుర పులికంటి మాట!

# మిన్ను

మనుజు డొకడె కాదు మనుజ సృష్టియుకూడ
కడకు శూన్యమందె కలియ వలయు
అరయ శూన్య మొకటె తిరమని తెలియరా
కంటి నలుసుర పులికంటి మాట!

మనిషి ప్రతిభ కైన మరి ఉదారతకైన
కన్ను మిన్నెరుగని గర్వమునకు
హద్దు తరచిచూడ ఆకాశమే గదా?
కంటి నలుసుర పులికంటి మాట!





శూన్యమందు చూడు చుక్కలు చంద్రుడు
సూర్యుడెట్లు నిలిచె చోద్యమరయ
సృష్టి మూలమేదొ సృష్టికే ఎరుకరా
కంటి నలుసుర పులికంటి మాట!

మనసు శూన్యమైన మరలిన చూపులు
వెదకు శూన్య మందు వెర్రివోలె
మనిషి చిత్తభ్రమకు మచ్చురా శూన్యము
కంటి నలుసుర పులికంటి మాట!

శూన్యమందు వెలుగు చుక్కల ఉనికిని
లెక్కగట్ట మనిషి లేచెపైకి
తాను శూన్య మగుట తనకె ఎరుక లేక
కంటి నలుసుర పులికంటి మాట!

పాంచ భౌతికమ్ము ప్రాణులొకటె కాదు
రూపు ఎట్టిదైన రూపుమారు
రూపరహిత విశ్వరూపమే శూన్యము
కంటి నలుసుర పులికంటి మాట !

# పన్ను

పన్ను అనగ నోట పన్నది కాదురా
కొన్న ధరల మీద కొసరు పన్ను
చీమ చిన్నదైన చీకాకు పరచదా?
కంటి నలుసుర పులికంటి మాట !

అమ్ముకొనగ పన్ను ఆదాయ మనపన్ను
కొనగ పోయి నపుడు కొరివి తలకు
కలముమీద పన్ను కవితపై రుద్దితే?
కంటి నలుసుర పులికంటి మాట!





ఎంతమంది? నూటికిద్దరు ముగ్గురో
ఏలలేదె మనల ఎదురు లేక!
జుట్టుమీద పన్ను మొట్టిరి తెలియదా?
కంటి నలుసుర పులికంటి మాట!

తెల్లదొరలు మనల తెలవిగా దోచిరి
ఉప్పుమీద పన్ను తప్ప దనిరి
గుప్పు మనగ లేచె ఉప్పు సత్యాగ్రహి
కంటినలుసుర పులికంటిమాట!

అన్న మేటి నటుడు అందాల రామన్న
దోసె ఇడ్లి పైన వేసె పన్ను
ధిక్కరించ నట్టి దేశభక్తి మనది!
కంటి నలుసుర పులికంటి మాట!

తెల్లదొరలె కాదు నల్లదొరలు కూడ
పన్ను వంకపెట్టి తన్నుచుండ
మూగనోము మనది ముచ్చట వారిది
కంటి నలుసుర పులికంటి మాట!

## చన్ను

తల్లిపాలు తాగి తల్లిరొమ్ముమను గుద్దు
తనయు లెంతమంది ధరణి లేరు?
ఎంచినట్లు తిన్న ఇంటికే వాసాలు
కంటి నలుసుర పులికంటి మాట!

అమ్మ చన్నుబాలు ఆరోగ్య కరమని
పాలకొరకు ఎన్నిపాట్లు పడెను?
ఋణము తీర్చు కొనెడు గుణవంతు డెవడురా?
కంటి నలుసుర పులికంటి మాట!





విడిచి ఒక్కచన్ను వేరొక చన్నును
పట్టులోపల పనిపట్టి సకల
విద్యలందు నేర్పు విధిగ సాధించరా!
కంటి నలుసుర పులికంటి మాట!

అమ్మ కొంగుచాటు అమరిన వ్యక్తిత్వ
ఫలితమందె మనిషి బ్రతుకు పందె!
ఆలికొంగు చాటు అదికొల్ల పోయెరా!
కంటి నలుసుర పులికంటి మాట!

చన్ను కుడువనేర్పె చక్కని నడతను
వేలుపట్టి నేర్ప వెతలు పడెను
ఇలను తల్లికన్న వెలయాలె మిన్నరా!
కంటి నలుసుర పులికంటి మాట!

ఆలికూడ అమ్మఔగద ఒకనాడు
చన్ను కుడిచి బిడ్డ తన్నినపుడు
అమ్మ ఓర్పు నేర్పు అర్థమై ఫలమేమి?
కంటి నలుసుర పులికంటి మాట!

# చెట్టు

ప్రకృతి వరము చెట్టు పరమపావని చెట్టు
పూజలందు కొన్న పుణ్యచరిత
కొలువ చెట్టువిలువ కొలమాన మున్నదా?
కంటి నలుసుర పులికంటి మాట!

వీచు గాలి విలువ వెలకట్ట లేమురా
మనసు కొరకు పూలు, మందులెన్ని?
మనిషికిలను చెట్టు మధురమౌ వరమురా!
కంటి నలుసుర పులికంటి మాట!





అవ్వ కైనకాని గువ్వ కైనను కాని
తల్లి ఒడిగ చెట్టు తావు నొసగు!
చెట్టు గుణము లేదె? చెట్టంత మనిషికి!
కంటి నలుసుర పులికంటి మాట!

రాళ్లు చేతి కెత్త రాల్చును ఫలములు
కత్తిచూపినంత కరగి వొరుగు
అణువు అణువు చెట్టు ఆత్మాహుతిని చేయు
కంటి నలుసుర పులికంటి మాట!

ఆలయమ్ము చెట్టు ఆధ్యాత్మ చింతన
చిగురు తొడిగి విడిగి చింతమాన్పు
ఆశ్రయించ విసిగి అనుభూతి నొసగురా
కంటి నలుసుర పులికంటి మాట!

సార్థకమ్ము చెందు చచ్చిన బతికిన
చెట్టు జన్మ మనిషి పట్టుకొమ్మ
జన్మ చెట్టుదైవ చరితార్థమే జన్మ
కంటి నలుసుర పులికంటి మాట!

# గుట్టు

గుట్టు మట్టులందు గూఢార్థ మరయగా
పట్టు దొరికినట్లె పట్టుతప్పు
పట్టి చూడ గుట్టు మనిషిలో మర్మమే
కంటి నలుసుర పులికంటి మాట!

కొంప లెన్ని కూలె గుట్టుచప్పుడు కాక?
గొంతు లెన్ని తెగెనొ అంతు లేదు
అంతుపట్ట గుట్టు అలవికానిది పట్టు
కంటి నలుసుర పులికంటి మాట!





మనసులోని గుట్టు మాటకు దొరకదు
చూపులందు వింతరూపు దాల్చు
సృష్టి గుట్టు తెలియ స్రష్టకే ఎరుకరా
కంటి నలుసుర పులికంటి మాట!

మాటలందు గుట్టు మలినమౌ మనసురా
ఆటలందు గుట్టు అవసరమ్మె
వాదమందు కత్తివాదర గుట్టురా
కంటి నలుసుర పులికంటి మాట!

గుట్టుమట్టు లెరిగి బెట్టుగా సంసార
సాగరాన నౌక సాగ మేలు!
వ్యాధి గుట్టు పరచి వాపోవగా నేల?
కంటి నలుసుర పులికంటి మాట!

గుణము కలుగువాడు గుట్టుగా బతుకును
ధనము కలుగ బతుకు దారి తప్పు
గుట్టుమట్టు తెలియ గురుతుల్యుడౌ గద!
కంటి నలుసుర పులికంటి మాట!

# రట్టు

పొట్టు విప్పిచూడ పొడసూపురా విత్తు
గుట్టువిప్ప వేయు రట్టు రంకె!
రట్టు చేయు టనగ రచ్చ కీడ్చుట కదా?
కంటి నలుసుర పులికంటి మాట!

పరుల జోలికేగు పట్టింపు లేకుండ
సాధువర్తనమున సాగువాని
బతుకు రట్టుచేయ భావ్యము కాదురా
కంటి నలుసుర పులికంటి మాట!





మంచిచెడులు రెండు మనిషిలో సహజాలు
మంచినెంచి చెడును మరవ వలయు
గుట్టు రట్టు చేయ కూలురా కొంపలు
కంటి నలుసుర పులికంటి మాట!

రట్టు చేయ తగును రసరమ్య భావాలు
రట్టు చేయ వలయు రైతు వెతలు
నేతల కథరట్టు నీతికి మెట్టురా
కంటి నలుసుర పులికంటి మాట!

రట్టు చేయ పేరు రాణించునని ఎంచి
రచ్చకీడ్చు తీరు మెచ్చ తగునె?
చరిత పుటల చీడపురుగులై మిగలరా?
కంటి నలుసుర పులికంటి మాట!

రట్టు చేయ కృష్ణ రాన లీలల హేల
పోతనయ్య కీర్తి పుడమి నిలిచె!
చరిత కెక్కు రట్టు సార్థకమే గదా?
కంటి నలుసుర పులికంటి మాట!

# బెట్టు

వంచి జుట్టుపట్టి వాటమే బెట్టురా
జుట్టు చేతికంద పట్టుదొరకు
పట్టు దొరకి నపుడె పాచిక పారురా
కంటి నలుసుర పులికంటి మాట!

ఓటు వేయ బెట్టు ఉన్నది లాభమే
పాడుమనగ బెట్టు పనికిరాదు
పడకమీద బెట్టు పడతులకే చెల్లు
కంటి నలుసుర పులికంటి మాట!





ఆలుమగల చెంత అరయ ప్రేయసి చెంత
బెట్టు అప్పుడపుడు బెడిసికొట్టు
బెడిసి కొట్టినపుడె బెట్టుకు పట్టురా!
కంటి నలుసుర పులికంటి మాట!

బతుకు దారులందు బాధల రొంపిలో
కూరుకొన్న మనిషి కోరినపుడు
బెట్టు చేయ తగదు పట్టియ్యి చేతిని
కంటి నలుసుర పులికంటి మాట!

భక్తి శ్రద్ధ లందు భక్తుని దీక్షలో
అంతు పట్టతలచి అప్పుడపుడు
దైవమైన బెట్టు దయమాలి చేయడే!
కంటి నలుసుర పులికంటి మాట!

బెట్టు చేయవచ్చు పట్టుసాధించగా
పట్టు విడుపు లుండ బెట్టు తగును
పంతమైన వేళ పరిహాసపాత్రమే
కంటి నలుసుర పులికంటి మాట!

# పట్టు

కట్టు గుడ్డ లందు కలనేత పట్టురా
పట్టుకొమ్మ లోన పట్టు కలదు
తరచి చూడ పట్టుదలగద పట్టురా?
కంటి నలుసుర పులికంటి మాట!

పట్టు పట్టరాదు పట్టిన పట్టును
విడువ రాదు మధ్య విజ్ఞుడైన
ఉడుము పట్టు పట్టు ఉన్నది ఫలితము
కంటి నలుసుర పులికంటి మాట!





ఎన్నివేల యేండ్లు ఎన్నెన్ని మార్గాల
మేధ పదును పెట్ట మేలు జరిగె
పట్టు ఒకరిదైన ఫలిత మింకొకరిది
కంటి నలుసుర పులికంటి మాట!

మనిషి మేధ పట్టు మంచినీటను పుట్టు
విశ్వ ప్రగతిగామి విద్యుతనగ
లేని క్షణము మనగ లేదురా లోకమే
కంటినలుసుర పులికంటిమాట!

మొసలి పట్టు వీడ మొరపెట్ట గజరాజు
వేలయేండ్లు పట్టు విడువ కుండ
దేవుడైన వాడు దిగిరాక తప్పెనా?
కంటి నలుసుర పులికంటి మాట!

పాలుమాలి నంత ఫలిత మొకటె కాదు
ప్రతిభకుంటు పడును వ్రతము చెడును
పాలు మాల నేల? బవిసి ఆరగ నేల?
కంటి నలుసుర పులికంటి మాట!

# భక్తి

కనులు రెండుమూసి కరములు ముకుళించి
మంత్రమొకటి చదువు యంత్రమనగ
శిలలముందు నిలువ చిక్కదు భక్తిరా
కంటి నలుసుర పులికంటి మాట!

గడ్డము తగొపెంచి ఘనముగా నుదుటిపై
బొట్టు తీర్చి గుడ్డ కట్టు మార్చి
దాసుడైతి వేని దక్కదు ముక్తిరా!
కంటి నలుసుర పులికంటి మాట!





తల్లిదండ్రిపైన తరువాత గురువుపై
సాటిమనిషి పైన చదువుపైన
భక్తిభావమున్న బతుకు సార్థకమౌను
కంటి నలుసుర పులికంటి మాట!

చేతనున్న పనుల చింతన చేయక
చిత్తవృత్తి కాదు శివుడి కొలువు
పనులమీద భక్తి పరమాత్మ మెచ్చురా
కంటి నలుసుర పులికంటి మాట!

శిల్పి శక్తిమేర చెక్కిన రాతికి
మహిమ నంటగట్టి మంది కొలువ
గొర్రెదాటు భక్తి గుణమేల? ఫలమేల?
కంటి నలుసుర పులికంటి మాట!

మనసె మందిరమ్ము మనిషిరా దేవుడు
మాట సత్యమెరిగి మనిషిపైన
మనసు నిలుపకున్న మలినమౌ భక్తిరా!
కంటి నలుసుర పులికంటి మాట!

# ముక్తి

ముక్తి మార్గ మరయ ముందుగా నిను నీవు
ఎరిగి నపుడె మార్గ మెరుక పడును
మాల పట్టి పలుకు మంత్రాలు దండగే
కంటి నలుసుర పులికంటి మాట!

లోకమొకటి గలదు లోలోన నీలోన
తీరు తెన్నుల కథ తెలియ వలయు
దాని గెలిచి నపుడె దరిదాపులో ముక్తి
కంటి నలుసుర పులికంటి మాట!





వేరె లోక మొకటి వెదకినా దొరకదు
వెతలు దానికొరకు వెఱ్ఱితనమె!
ముక్తి వెదకు కంటిముందున్న లోకాన
కంటి నలుసుర పులికంటి మాట!

లౌకిక పరమైన లంపటముల నుండి
తెంపు కొనగ ఆశ చంపుకొనగ
కలుగు తృప్తియందె కలదురా మోక్షమ్ము
కంటి నలుసుర పులికంటి మాట!

ముక్తి ముక్తి అనుచు మూఢులై గుడులకు
పరుగులిడగ ముక్తి పడయ లేరు
సాధు వర్తనమున సాధించు ముక్తిరా
కంటి నలుసుర పులికంటి మాట!

జన్మలందు మనిషి జన్మమే ధన్యము
వేరు జన్మ కొరకు వెతలె వెఱ్ఱి
జన్మమర్మ మెరుగ ధన్యమే జన్మరా!
కంటి నలుసుర పులికంటి మాట!

# రక్తి

నాటకమ్ము రక్తి నటుల ప్రతిభ సాక్షి
పాటరక్తి గళము పరిమళింపు
బ్రతుకు రక్తిగట్ట బాధలు తప్పవు
కంటి నలుసుర పులికంటి మాట!

మెప్పు రక్తిగట్టు మితమైన వేళల
ఉప్పు రక్తి మితము తప్పనపుడె!
తప్పు రక్తిగట్ట తప్పవు ముప్పులు
కంటి నలుసుర పులికంటి మాట!





గెలుపు రక్తిగట్ట వలయును మేదస్సు
వలపు రక్తిగట్టు మలుపు తిరుగ
తలపు రక్తిగట్ట తన్మయ మరయరా!
కంటి నలుసుర పులికంటి మాట!

మాటలందు రక్తి మర్యాదలందగ
చేతలందు రక్తి రాతమార్చు
చూపు రక్తి జన్మ సూక్ష్మము నరయుగా
కంటి నలుసుర పులికంటి మాట!

ఆలుమగల మధ్య అనురాగమున రక్తి
గురువు సేవలందు గుర్తు రక్తి
పరుల సేవలందె పరిణతి రక్తిరా!
కంటి నలుసుర పులికంటి మాట!

తగుదు తగుదు ననుచు తలపెట్టు పనులలో
రక్తి చెడిన తరి విరక్తి కలుగు
రక్తి అనగ పనుల రాణించుటే గదా?
కంటి నలుసుర పులికంటి మాట!

# భుక్తి

కూలి చేసుకొన్న జోలె చేపట్టిన
పగలు రాత్రి అనక పరుగు లిడిన
భుక్తి కొరకె పొట్లు ముక్తికై కాదురా!
కంటి నలుసుర పులికంటి మాట!

పట్టె డెక్కు వైన పట్టదు పొట్టని
వద్దు వద్దటంచు వదల కలిగి
మితము పొట్టనేర్వ వెతలేల బతుకులో?
కంటి నలుసుర పులికంటి మాట!





కొంపలెన్నొ కూల్చు గొంతులు కోయును
మోసపు పనులందు మునిగితేలు
పొట్ట జానెడైన పోకడ లెన్నిరా?
కంటి నలుసుర పులికంటి మాట!

జన్మ తిరముకాదు, జమచేయు సంపద
తిరముకాదు ఏది తరము కాదు
చచ్చి కూడ బ్రతుక సాధించ వరమురా
కంటి నలుసుర పులికంటి మాట!

భుక్తి కొరకు పన్ను యుక్తిపై యుక్తులు
ముక్తి కొరకు పడిన మోక్షమబ్బు
జనుల మేలుకోర జన్మకు మోక్షము
కంటి నలుసుర పులికంటి మాట!

చొంగ గడప గడప సోకులు దిద్దగా
కుక్క కుడుచు కూడు గుణము లేదు
చెమట కరిగి భుక్తి చేకూర్చు రక్తిరా!
కంటి నలుసుర పులికంటి మాట!

# యుక్తి

ఆయుధమ్ము యుక్తి ఆచరించగ రక్తి
పనుల సాధనమున పలుకు శక్తి
యుక్తి మర్మ మరయ వ్యక్తిలో శక్తిరా
కంటి నలుసుర పులికంటి మాట!

పట్టు విడుపు లెరిగి పట్టిన మాత్రాన
ఎదురు బెదరులేక ఎదుగవచ్చు
అగ్గిపుల్ల యందు అణగిన నిప్పురా
కంటి నలుసుర పులికంటి మాట!





చేతిలోని దివ్వె చీకటి మార్గాన
అద్భుతాలు పొదుగు అంజనమ్ము
అరయ యుక్తికాదు అందరి సొత్తురా
కంటి నలుసుర పులికంటి మాట!

కోయగలదు కత్తి గొంతును పండును
తారతమ్య మెరుగ తపన పడదు
యుక్త మరయకున్న యుక్తియే నినుముంచు
కంటి నలుసుర పులికంటి మాట!

యుక్తి రక్తి చెడి కుయుక్తిగా మారిన
చెత్త చిత్తమందు చేర్చినటులె!
నక్కజిత్తు లెట్లు లెక్కకు ఎక్కును?
కంటి నలుసుర పులికంటి మాట!

యుక్తి తప్పుకాదు యుక్తమౌ వేళల
రక్తి కట్టును తలరాత మార్చు
పరుల హితము కోరి పన్నిన నేర్పుగా
కంటి నలుసుర పులికంటి మాట!

# శక్తి

పంచభూతములను పద్ధతిమేరకు
నడపు శక్తిదాని నైజ మరయ
ఊహకందకుండ ఉగ్రూత లూగించు
కంటి నలుసుర పులికంటి మాట!

గుండెబలము కలిగి కండలుతోడైన
శక్తిమంతు డనగ యుక్త మగునె?
తెగనికత్తి పొడవు తెగబారె డన్నట్లు
కంటి నలుసుర పులికంటి మాట!





నిప్పులోని శక్తి నీటదాగినశక్తి
గాలిలోని శక్తి కంటపడదు
అంతుపట్టలేవు ఆహారమున శక్తి
కంటి నలుసుర పులికంటి మాట!

పంచభూతములకు ప్రతిరూపమై ఒప్పు
దేహమందు వెలయు తెలివి శక్తి
కడలి కట్టుబాటు కనవలె శక్తిలో
కంటి నలుసుర పులికంటి మాట!

విజయమందు కొనగ వికసించు శ్రమశక్తి
మనసు దోచు కొనగ మాటశక్తి
బ్రతుకు తీర్చిదిద్ద భాసించు ధీశక్తి
కంటి నలుసుర పులికంటి మాట!

తిమిరి మాటశక్తి ధీశక్తి శ్రమశక్తి
విధిగ మేలు చేయ విడిచి నపుడె
సార్థకమ్ముశక్తి సాధించు జన్మలో
కంటి నలుసుర పులికంటి మాట!

# తెలుగు

తెలుగుగడ్డ నాది తెలుగుబిడ్డను నేను
తెలుగుగంగ త్రావి తేరినాను
తెలుగు టాక్కటన్న తికమక నాదన్న
కంటి నలుసుర పులికంటి మాట!

తెలుగు ఘనత నాది తెలుగు తేజము నాది
తెలుగు వాడినాది తెలివినాది
తిక్కరేగి నపుడు తెగులును నాదిరా!
కంటి నలుసుర పులికంటి మాట!





తెలుగు టీవిచూడు తెలుగు సిన్మా చూడు
తెలుగు ఆట పాటతీరు చూడు
హెడ్డు కలిగినేని హెడ్డేక్కు తప్పదు
కంటి నలుసుర పులికంటి మాట!

ఫాదరిన్ల ఎపుడొా ప్రామీసు చేసెను
గోల్డురింగు జతకు గోల్డువాచి
బర్తుడేకి గిఫ్టు బ్రహ్మాండ మీటెల్గు
కంటి నలుసుర పులికంటి మాట!

అమ్మ అయ్య అనుచు హాయిగా పలుకను
చేతగాక కాదు పాత రోత !
మమ్మిడాడి ఇంపు మనభాషకే సొంపు
కంటి నలుసుర పులికంటి మాట!

తెలుగు కన్నడముల తియ్యందనాలను
ఎరిగి కన్నడదొర ఎప్పుడనెను?
లెస్సరా తెలుగన లెస్సేను కొంటిమి
కంటి నలుసుర పులికంటి మాట !

(1990లో బెంగుళూరులో అఖిలభారత తెలుగు మహాసభలు
నిర్వహించిన కవి సమ్మేళనంలో చదివిన కవిత)

# హైబ్రిడ్

వాలిబాలు బోలు వంకాయ టెంకాయ
హైయ్యిబ్రీడు వలన అమరుచుండ
భాష బ్రీడ్డు చేయ దోషమెట్లగునురా?
కంటి నలుసుర పులికంటి మాట!

దేశ భాషలందు తెలుగు లెస్సనుమాట
పలికినాడెవడొ ప్రాజ్ఞుడతడు!
హైయ్యిబ్రీడులోని అందాలు తెలియక!
కంటి నలుసుర పులికంటి మాట!





తెలుగుకన్నడముల తలకట్లు వంకర్లు
మార్పు చేసికొనెడు మార్గముండ
వాదులాటలేల? వైరమ్మె మనకేల?
కంటి నలుసుర పులికంటి మాట!

అర్థమెరిగికూడ అక్షరముల వంపు
మర్మమెరుగ లేని మనిషి పిచ్చి
కట్టెవంపు పొయ్యి కడతేర్చు చుండగా
కంటి నలుసుర పులికంటి మాట!

పిల్లదాని ఫీజు చెల్లించగా వైపు
తెలుగుకవిని దుడ్లు తెమ్మనంగ
కవిత తెలుగుదయ్యె కాన్వెంటు ఫీజుకై
కంటి నలుసుర పులికంటి మాట !

పుష్టమాయె లేక భ్రష్టమే చెందెనో
శిష్టజనుల కెరుక చింతచేయ
భావపుష్టి లోటె భాషకు లేదురా
కంటి నలుసుర పులికంటి మాట !

(1990లో బెంగుళూరులో అఖిలభారత తెలుగు మహాసభలు
నిర్వహించిన కవి సమ్మేళనంలో చదివిన కవిత)

# అనుభూతి

గంట నడకయందె గణనీయమైనట్టి
వేమనార్యు జాడ వెదకి పట్టి
పూనుకొన్న వాడ పులికంటి వంశాన!
కంటి నలుసుర పులికంటి మాట!

నడక తప్పదనగ నాదగు జన్మకు
నడక పట్టి నడత నాదు కవిత
కవిత నడత లెన్న కైమోడ్చి వేడెద!
కంటి నలుసుర పులికంటి మాట!





చివరి క్షణము వరకు చేపట్టు పనులందు
పట్టు సడల దేని ఫలిత మబ్బు
ఫలితమందు వేళ ప్రాప్తమే అనుభూతి
కంటి నలుసుర పులికంటి మాట!

ఆదిశేషుడైన అనుభూతి వివరింప
తరము కాదటంచు తల్లడిల్లు
అనుభవాల తీపి అందునా మాటకు?
కంటి నలుసుర పులికంటి మాట!

కథలు కవిత చదువ కలిగెడి అనుభూతి
కర్మయోగ మందు కలిగె నేని
అరయ దానకలుగు అనుభూతి మిన్నరా
కంటి నలుసుర పులికంటి మాట!

దెప్పి పాడిచినారు దేశాన కొందరు
కవిని కాదు నేను కథకుడనని
కల్ల నిజము లరయ కవితలే సాక్షిరా
కంటి నలుసుర పులికంటి మాట!